Photo by D. S. Kasbekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిన్నది చెపుతా నొక మాట...

పంపినవారు :
బి. ప్రకాశరావు - విజయనగరం

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

*



ఇవి గాక :
ఫొటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.





## ధైర్యశాలి రాము



## డంబాల రంగా





నేనొకనాడు అడవిలోకి చాలాఎక్కువ దూరం, వెళ్లాను....



అక్కడ నేనొక నక్కను చూశాను.... నేను ఇంకా చెయ్యెత్తానో లేదో, అది చుంచులాగపారిపోయింది.



తరువాత అక్కడికో భయంకరమైన సింహం వచ్చింది!



కాని, నేనేమాత్రమూ భయ పడలేదు సుమా! సరిగ్గా దానికళ్లల్లోకి తీవ్రంగా చుశాను, ఆ సింహం అసలు అక్కడికి రానే లేదు అనిపించేలాగ మాయమైపోయింది!

HVM. 298A-19 TL


ఇలా ప్రగల్భాలు కొట్టు తున్నప్పుడే అక్కడి కొకుక్క వచ్చింది, ఇంక రంగా పారి- పోయి చెట్టు మీదకెక్కాడు.


భయ పడకు రంగా. ఇది మోతియే- నా కుక్క.


నేనే మీ భయ పడలేదు. నిజ స్థుడను నేనెంత మాత్రమూ భయ పడలేదు.
అలాగైతే, నీవు నిజస్థు డవు కూడాను, కదూ? ఇంతెం దుకు, శలాంటి బలహీనుడైన పిరికి వాడు ఒక ఈగనైనా చంపలేడు!


అలా అనుకుంటున్నావా? అయితే నాతో పరుగుపందె మునకురా ప్రతిమాటూ నిన్ను ఓడించేస్తాను.


ఎంతో దూరం పరుగెత్త నేలేదు, అప్పుడే రంగా ఒగురుస్తున్నాడు.


ఇలా చూడు, రంగా నీవు సరిగ్గా నాలాగ బలంగా వుండాలంటే, నీవు డాల్డాతో వండ బడిన ఆహారం భుజిం చాలి, ప్రతిరోజూ పాలుకూడా త్రాగాలి, తెలిసిందా?


DIAMOND NUT
OP & Co. C.B BELLARY
POWDER

ఇక యిప్పుడు, ప్రతిఒక్కరూ సంపాదించటానికి
వీలయిన టేప్ రికార్డర్ ఇక్కడ ఉన్నది!




ఎంతకాలంనించో కావాలని మీరు ఆత్రంతో నిరీక్షించిన గ్రండిగ్ టేప్ రికార్డరు ఇప్పుడు మీకు అందుబాటులో ఉన్నది. ఇంతటి తక్కువ ధరకు ఇవ్వగల్గటానికి కారణం యంత్రనిర్మాణాన్ని సుకరం చేయటమే. అయితే ఉన్నతస్థాయిని అందుకొన్నటువంటి గ్రండిగ్ పనితనము, అనమానమైన నాణ్యము, డిజైను శోభ—ఇవన్నీ ఎప్పటిలాగానే ఉంటున్నవి.

వెల రు. 1,050/-

ఒకటి కొని, యావజ్జీవితమూ
కుటుంబానికి వినోదము చేకూర్చండి.

డిస్ట్రిబ్యూటర్లు:

**మహమ్మద్ ఇబ్రహిం అండ్ కో (ప్రైవేట్) లిమిటెడ్.,**

7/8 మౌంట్ రోడ్, మద్రాసు - 2

బ్రాంచీలు: 26 / 27 రత్తన్ బజార్, మద్రాసు - 3
113-H బ్రిగేడ్ రోడ్, బెంగళూరు - 1
అబిడ్ రోడ్, హైదరాబాద్ (దక్కన్)



# త్వరితమైన కోడక్ 'ట్రై-ఎక్స్' చిత్రములను తీయుట సులభము సరదాగా కూడ ఉంటుంది

మబ్బుగానున్న రోజులలో యింటిలో లేక బయట చక్కని స్నేపులను తీయుటకు ఆశ్చర్యకరముగ త్వరితమైన కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్మును వాడితే చాలును. కృత్రిమపు వెలుతురు అవసరము లేదు! ఒక మామూలు బాక్స్ కెమేరా అయినా పరవాలేదు!

ఆశ్చర్యకరముగ త్వరితమైన కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్ము వాడితే ఫ్లాష్ అవసరము లేకుండానే యింటిలో చక్కని చిత్రములను తీయవచ్చును! పగటివేళ యింటిలో స్నేపులను తీయుటకు చిత్రములో పడేవారిని గదిలో ఎక్కువ వెలుగున్న చోట, వరండా, తలుపు లేక కిటికీ ముఖముగ ఉండమనండి. ఎక్కువ వెలుతురు పడేవైపే మీ కెమేరాను నిశ్చయముగ త్రిప్పి ఉంచి, తరువాత దృశ్యమందు లక్ష్యముంచి మామూలుగా చేస్తున్నట్టే మీటను నొక్కండి.

చక్కని స్నేపులను తీయుటకు యిదివరకు చాలదనుకొన్న వెలుతురులో కూడ కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్ము వాడితే దివ్యమైన చిత్రములు వచ్చును! కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్మును కొని దివ్యమైన చిత్రములను తీయుట నేడే ప్రారంభించండి!




క్రొత్త కోడక్ 'వెరిక్రోమ్' పాన్ ఫిల్ము వాడి ఏ వస్తువునైనా ఏ వెలుతురులోనైనా సహజత్వము ఉట్టిపడేలాటి చిత్రము తీయవచ్చును! సూక్ష్మమైన గ్రెయిన్, ఎక్కువ వేగము (డే లైట్ 80). ఈ దివ్యమైన పాన్‌క్రోమేటిక్ ఫిల్ము నేడే కొనండి!

అతి త్వరితమైన కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్ము. ఉన్న వెలుతురులో— 200 డే లైట్, 160 టంగ్‌స్టన్ — చిత్రములను తీయుటకు తగినది. మధ్యరకముదైన గ్రెయిన్. ఒకే రంగులోని రెండు ఛాయలలోని భేదమును కూడ చూపును. చిత్రములు స్పష్టముగా ఉంటాయి.




K. 4476

కోడక్ లిమిటెడ్

## నమ్మకమైన 'కోడక్' కెమేరాతో మీరు

## ఫిల్ము వాడితే వర్షాకాలములో మరియు



త్వరితమైన 'ట్రై-ఎక్స్' ఫిల్ముతో వర్షాకాలములో చీకటిగా, మబ్బుగా
నున్న రోజులలో కూడ యిటువంటి చిత్రములను తీయగలరు

(ఇంగ్లండులో సంస్థాపితము: కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము) బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు

## ఎల్లప్పుడూ మంచి చిత్రములను తీయగలరు!

# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట ఆవశ్యకమైయున్నది — అయితే ఆటయందు గాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము. మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి. వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాద మున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుటవల్ల మీరు మరల హాయిగా నుందురు. అలసట మటుమాయమగును. లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేయుడు — మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు.




L. 265-50 TL.

## 'చందమామ' కు
## ఏజంట్లు కావాలి

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూ వుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

**చందమామ పబ్లికేషన్సు,**

వడపళని, మద్రాసు - 26

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. నకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అన్ని జన్మలలోకీ మానవజన్మ ఉత్తమమైనది, తరించదలచినవాళ్లు మానవ ప్రపంచంలో ఉండగానే తరించాలి, అన్న సత్యాన్ని, "మానవజన్మ" [జాతక కథ] స్పష్టం చేస్తున్నది.

బోధిసత్వుడు తన మానవజన్మలో ఎంతో పుణ్యాత్ముడై ఉండిన్నీ, పేదరికం అనుభవించి ఉండిన కారణంచేత చనిపోయే సమయంలో నాగరాజు ఐశ్వర్యాన్ని ఆశించి నాగజన్మ ఎత్తాడు. కాని వెంటనే ఆయన తన పొరపాటును గ్రహించి, మానవలోకానికి వెళ్లి, అనేక అపాయాలకు గురి అయి, మానవనిష్ఠలు అవలంభిస్తాడు. ఈ విధంగా ఒక పాము పుణ్యమార్గంకోసం ప్రయత్నిస్తూ ఉంటే, మానవజన్మ ఎత్తిన బ్రాహ్మణ యువకుడు, తన ఉత్తమ ధర్మాన్ని విసర్జించి ఆ పామును ఆడించి డబ్బు సంపాదించటానికి కాశీదాకా వెళతాడు. ఆదర్శాలలో గల ఈ వ్యత్యాసం ఈ కథలో చక్కగా చూపబడింది.

సంపుటి 21 అగస్టు 1957 సంచిక 2





# అట్టివిూది బొమ్మ

విరాటరాజు నిండుకొలువులో కీచకుడిచేత పరాభవం పొందిన ద్రౌపది అంతః పురానికి తిరిగిరాగానే సుదేష్ణ ఆమెను చూసి, " ఎందు కలా ఉన్నావు? నిన్ను ఎవరు బాధించారు ?" అని అడిగింది. ద్రౌపది ఆమెతో జరిగినదంతా చెప్పింది. " నా తమ్ముడు ఇంతపని చేస్తాడా ? వాణ్ణి చంపిస్తాను !" అన్నది సుదేష్ణ.

"నన్ను పరాభవించినందుకు అతనిమీద ఎవరికి రోషం వస్తుందో వారే అతన్ని చంపేస్తారు !" అన్నది ద్రౌపది.

అప్పటికే ఆమె కీచకుణ్ణి భీముడిచేత చంపించాలని నిశ్చయించుకుని ఉన్నది. అ రాత్రి అందరూ గాఢనిద్రలో మునిగి ఉన్న సమయంలో ఆమె భీముడు పడుకునే చోటికి వెళ్ళి, అతన్ని లేపింది.

"నీ భార్యను ఒక దురాత్ముడు నీ యెదటనే పరాభవించటం కళ్ళారా చూసికూడా ఎలా నీకు నిద్రపట్టింది ?" అంటూ ద్రౌపది తన కష్టాలన్నీ భీముడికి చెప్పుకుని ఏడ్చింది.

"ఇంక కొద్దికాలం ఓపికపట్టు! మన అజ్ఞాతవాసదీక్ష పూర్తి అయి పోతుంది; మనకు మళ్ళీ మంచిరోజులు వస్తాయి !" అన్నాడు భీముడు.

"అంతదాకా నేను జీవించి ఉంటేగద ? మదాంధుడైన కీచకుడు నన్ను వదలడు. మీరు అయిదుగురూ ఉండికూడా నన్ను ఆ దుర్మార్గుడి బారినుండి కాపాడ లేరు. ఇక నేను జీవించటం సాధ్యంకాదు. తెల్లవారేలోగా కీచకుడు చావనిపక్షంలో నేను ప్రాణత్యాగం చేసుకోకతప్పదు. రేపు మళ్ళీ వాడి మొహం ఎలా చూడను ?" అంటూ ద్రౌపది కన్నీరు కార్చింది.

ఈ మాటలతో భీముడికి రోషం వచ్చింది. " ఆ కీచకుణ్ణి నేను తప్పక చంపుతాను; నువు విచారించకు. అయితే ఈ పని రహస్యంగా జరగాలి. తెల్లవారగానే కీచకుడు నీవద్దకు వచ్చినప్పుడు వాడిపైన నీకు ఇష్టం కలిగి నట్టుగా నటించి, రేపురాత్రికి నర్తనశాలకు రమ్మని చెప్పు. ఆడవాళ్ళు పగలల్లా అక్కడ నృత్యం నేర్చుకుంటారు, కాని రాత్రివేళ అక్కడ ఎవరూ ఉండరు. వాడితో నేను యుద్ధంచేస్తుంటే ఎవరూ అడ్డరు. అక్కడినుంచే నేను వాణ్ణి యమపురానికి పంపేస్తాను !" అని భీముడు ద్రౌపదితో ప్రమాణంచేశాడు.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు మగధరాజ్యంలో ఒక పేదవాడుగా జన్మించి మగధరాజు పరివారంలో ఒకడుగా ఉంటూఉండేవాడు.

మగధదేశానికీ, అంగదేశానికి మధ్యగా చంపానది ప్రవహిస్తూ ఉండేది. ఆ నది అడుగున నాగరాజ్యం ఉండేది. చంపేయ్యుడు ఆ రాజ్యానికి రాజు.

మగధరాజ్యానికీ అంగరాజ్యానికీ మధ్య ఎల్లప్పుడూ యుద్ధాలు సాగుతూండేవి. అలా జరిగిన ఒక యుద్ధంలో మగధరాజు ఓడి పోయాడు. ఆయన తన గుర్రంమీద ఎక్కి పారిపోతూ చంపానదివద్దకు వచ్చి, తన శత్రువు చేతికి చిక్కి చావటంకంటె ఆత్మ హత్య చేసుకోవటం మంచిదనే ఉద్దేశంతో, తన గుర్రంతోసహా నదిలోకి ఉరికాడు. మగధరాజుతోసహా గుర్రం నాగరాజు కొలువుకూటంలో వాలింది.

నాగరాజు తన సింహాసనం నుంచి లేచి వచ్చి మగధరాజుకు ఆదరపూర్వకంగా స్వాగతమిచ్చి ఆయన కథ యావత్తూ తెలుసుకున్నాడు.

"జరిగినదానికి మీరు విచారించకండి. ఈ యుద్ధంలో మీకు విజయం లభించటానికి నేను తోడ్పడగలను," అని నాగరాజు తన అతిథికి మాట ఇచ్చాడు.

అప్రకారమే నాగరాజు మగధరాజుకు యుద్ధంలో సహాయపడ్డాడు. అంగరాజు మగధరాజుచేతిలో చనిపోయాడు. మగధ రాజు రెండు దేశాలకూ రాజై వైభవంగా పరిపాలించసాగాడు.

అది మొదలు మగధరాజుకూ నాగ రాజుకూ బద్ధమైత్రి ఏర్పడింది. మగధ రాజు ఏటా ఒక రోజున సపరివారంగా చంపానదీతీరానికి వెళ్ళేవాడు. ఆ రోజున నాగరాజు నదినుంచి అత్యంత వైభవంతో

వెలువడి మగధరాజు తెచ్చిన బహుమా నాలు అందుకునే వాడు.

మగధరాజు పరివారంలో ఒక భృత్యుడుగా ఉంటున్న బోధిసత్వుడు ఏటా నాగరాజు వైభవాన్ని కళ్ళారా చూస్తూ వచ్చాడు. అయన చనిపోయే క్షణాన ఈ నాగరాజు వైభవమే అయన మనసులో మెదిలింది. ఆ కారణంచేత అయన నాగ రాజు చనిపోయిన ఏడవనాడు తానే నాగ రాజుగా జన్మించాడు.

కాని కిందటి జన్మలో పుణ్యాత్ముడై ఉండిన కారణంచేత అయన కిప్పుడు తన పాముశరీరం చూసుకోగానే ఎంతో రోత పుట్టింది; నాగరాజు ఐశ్వర్యాన్ని కాంక్షించి నందుకు అయనకు పశ్చాత్తాపం కూడా కలి గింది. అయన ఆత్మహత్యా చేసుకుని ఈ జన్మ చాలింతామనుకుంటున్న సమ యంలో సుమన అనే నాగకన్య అయన ఉన్నచోటికి తన చెలికత్తెలను వెంటబెట్టు కుని వచ్చి, అయనకు ప్రణామం చేసింది.

సుమనను చూడగానే నాగరాజు ఆత్మ హత్యా ప్రయత్నం మానేసి, ఆమెను తన భార్యను చేసుకుని నాగలోకాన్ని పరిపా లించ సాగాడు.

కాని కొంతకాలానికి అయనకు ఉప వాసాలూ, నిష్ఠలూ జరిపి, పుణ్యం సంపా





దించుకోవాలనే కోరిక కలిగింది. ఇందుకుగాను ఆయన తన లోకాన్ని విడిచి మానవలోకంలోకి వెళ్ళ నిశ్చయించాడు. ఉపవాస దినాలు వచ్చినప్పుడాయన తన భవనం వెలువడి, ఒక రహదారి పక్కన ఉండే చీమలపుట్టమీద చుట్టచుట్టుకు పడుకుని, "నన్ను ఏ గద్ద అయినా తన్నుకుపోనీ! ఏ పాములవాడైనా పట్టుకుపోనీ!" అనుకునే వాడు.

కాని ఆయన అనుకున్నట్టు జరగలేదు. రహదారి వెంట వెళ్ళే మనుష్యులు పుట్టమీద చుట్టుకుని ఉన్న పామును చూసి దేవతగా భావించి, పూలతోనూ చందనం



తోనూ పూజించసాగారు. ఆ సమీపాన ఉండే గ్రామానికి చెందినవారు కొందరు ఆ నాగరాజుండే పుట్టవద్ద ఒక ఆలయం కట్టారు. ప్రతిరోజూ అక్కడికి రకరకాల ప్రజలు వచ్చి పిల్లలు కావాలనీ, తమ కోరికలు తీరాలనీ మొక్కుకోసాగారు.

నాగరాజు ఉపవాస దినాలన్నీ పుట్టమీద గడిపి ప్రతి మాసమూ కృష్ణ పాడ్యమి నాడు యింటికి తిరిగిపోతూ ఉండేవాడు.

ఒకనాడు సుమన ఆయనకు, "స్వామీ, మీరు తరుచు మానవలోకంలోకి వెళుతున్నారు. ఆ లోకం అపాయకరమైనది, భయంకరమైనది. మీకేదైనా ప్రమాదం జరిగే పక్షాన నాకా సంగతి తెలిసేదెలా?" అని అన్నది.

నాగరాజు సుమనను ఒక కొలనువద్దకు తీసుకుపోయి, "ఈ నీరు చూడు. నాకేదైనా దెబ్బ తగిలితే ఈ నీరు మురికి అవుతుంది. నన్నేదైనా గరుడపక్షి తన్నుకుపోతే ఈ నీరు ఇగిరి పోతుంది. అలాకాక, ఏ మంత్రగాడైనా నన్ను పట్టుకున్న పక్షంలో ఈ నీరు రక్తవర్ణంగా మారుతుంది" అని ఆమెతో చెప్పాడు.

కాశీనగరవాసి అయిన ఒక బ్రాహ్మణ యువకుడు తక్షశిలకు వెళ్లి అక్కడ వశీ



కరణవిద్య నేర్చుకుని తన దేశానికి తిరిగి పోతూ నాగరాజు పడుకునే చోటికి రహదారి వెంబడి వచ్చాడు. పుట్టపైన చుట్టుకుని పడుకుని ఉన్న నాగరాజు అతని కంట పడ్డాడు. వెంటనే ఆ యువకుడు పామును మంత్రంతో బంధించి పట్టుకుని, ఒక బుట్టలో పెట్టి, ఒక గ్రామానికి తీసుకుపోయి అక్కడ ఆ పామును ఆడించాడు. చూడ వచ్చిన గ్రామస్తులు పాములాటకు సంతో షించి బ్రాహ్మణ యువకుడికి డబ్బూ, ఇతర బహుమానాలు ఇచ్చారు.

"ఈ కుగ్రామంలోనే ఇంత డబ్బు వస్తే ఇంక పట్టణాలలో పామునాడిస్తే ఇంకా ఎంత వస్తుందో!" అని బ్రాహ్మణ యువ కుడికి ఆశ కలిగింది.

అతను పామును వెంట తీసుకుని కాశీనగరానికి బయలుదేరి, బండిమీద ప్రయాణంచేస్తూ ఒక మాసానికల్లా కాశీ నగరాన్ని చేరుకున్నాడు.

ఈ నెల రోజులపాటూ నాగరాజు కటిక ఉపవాసాలు చేశాడేగాని, బ్రాహ్మణ యువ కుడిచ్చిన కప్పలను తాకనేలేదు. "నేను అహారం తిన్నంత కాలమూ నాకీ బుట్టలో యీ యువకుడివల్ల ఖైదు తప్పదు!" అని అయన తెలుసుకున్నాడు.



బ్రాహ్మణ యువకుడు నాగరాజుచేత కాశీనగర సమీపాన గల అనేక గ్రామా లలో ఆడించి అక్కడి ప్రజలనుంచి అంతు లేని డబ్బు సంపాదించాడు.

ఈ పాములాట వినోదంగురించి త్వర లోనే కాశీరాజుకు తెలియవచ్చింది. అయన బ్రాహ్మణయువకుణ్ణి పిలిపించి తన వినోదం కొరకు పాములాట ఏర్పాటు చేయించాడు.

ఈ లోపల నాగలోకంలో సుమన, నెల రోజులుగా తన భర్త ఇంటికి రాకపోవటం గమనించి ఏదో జరిగివుంటుందని భయ పడి, నిజం తెలుసుకునేటందుకు కొలను వద్దకు వెళ్లింది. కొలనులో నీరు ఎర్రగా,



రక్తంరంగులో ఉన్నది. ఎవడో పాముల వాడు తన భర్తను పట్టుకున్నట్టు సుమన తెలుసుకున్నది. ఆమె తన భర్తను వెతుక్కుంటూ బయలుదేరి, దారిలో వాకబు చేస్తూ, త్వరలోనే కాశీనగరం చేరుకున్నది.

ఆమె అక్కడికి చేరేసరికి పాములాట జరుగుతున్నది. రాజుగారూ, అనేకమంది ప్రజలూ చేరి వినోదం చూస్తున్నారు. తన భార్యను చూడగానే నాగరాజు సిగ్గుపడి, ఆట మాని, బుట్టలోకి వెళ్ళిపోయాడు.

సుమన మానవస్త్రీరూపం ధరించి రాజును సమీపించి, "మహారాజా, నాకు పతిభిక్ష పెట్టండి!" అని వేడుకున్నది.

ఇంతలోనే పాముకూడా బుట్టలోనుంచి బయటికి పాకివచ్చి, అందరూ చూస్తుండగానే, ఒక ఆకర్షణీయమైన యువకుడి ఆకారం ధరించింది.

కాశీరాజు ఆ నాగ దంపతులను చూసి ముచ్చటపడి, వారిని వారంరోజులపాటు తన అతిథులుగా ఉంచుకుని, తరవాత వారివెంట తానుకూడా సపరివారంగా ప్రయాణమై నాగలోకానికి వెళ్ళాడు.

నాగలోకంలోని ఐశ్వర్యమూ, అందమూ వైభవమూ చూసి కాశీరాజుకు చెప్పతరం కాని ఆశ్చర్యం కలిగింది.

"ఇంత వైభవంలో ఓలలాడుతూ మీరు పాము రూపంలో చీమల పుట్టపై చుట్ట చుట్టుకుని పడుకోవటానికి కారణమేమిటి?" అని కాశీరాజు నాగరాజును అడిగాడు.

"రాజా, ఇక్కడ ఎంత వైభవం ఉన్నప్పటికీ జన్మరాహిత్యం పొందే సౌకర్యం మీ మానవలోకంలో మాత్రమే ఉన్నది!" అని నాగరాజు ఆయనకు సమాధానం చెప్పాడు.

కాశీరాజు ఈ మాట విని పరమానందం చెందాడు. ఆయన తన రాజ్యానికి తిరిగి వెళ్ళేటప్పుడు నాగరాజు ఆయనకు అంతులేని బహుమానాలిచ్చి పంపాడు.






# ముగ్గురు మాంత్రికులు

## 8

[పింగళుడు మరోసారి పాడుదేవళంలో ప్రవేశించి, అక్కడ వున్న దుష్టశక్తులను జయించి, మహామాయుడి సమాధిని చేరాడు. తరవాత, మహామాయుడి వేలినున్న ఉంగరాన్నీ, వజ్రాలుతాపిన పిడిగల కత్తినీ, భూగోళాన్నీ తీసుకుని సురక్షితంగా బయటికి వచ్చాడు. అంతలో నదీగర్భంనుంచి పెద్ద ధ్వనితో నీటిధార ఒకటి లేచింది. తరవాత—]

అంత గొప్ప మాంత్రికుడైన పద్మపాదుడు, నదీగర్భంనుంచి పైకి లేచిన నీటిధారను చూచి, అదిరిపడి వెనకడుగు వేయటం, పింగళుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు పద్మపాదుడి పక్కనే నిలబడి నిర్భీతిగా ఆ నీటిధారకేసి చూస్తూ, "పద్మపాదా! కావాలంటే ప్రపంచంమొత్తాన్నే దాసోహం అనిపించుకోగల శక్తులు మనదగ్గిర వున్నవి గదా? అటువంటప్పుడు, ఆ నీటిధారను చూచి మనం భయపడవలసిందేమి వున్నది?" అన్నాడు.

పింగళుడి ప్రశ్న వింటూనే పద్మపాదుడు కొంత కుదుటపడ్డాడు. అతడు పింగళుడికేసి తిరిగి, ఆప్యాయంగా అతడి భుజం తడుతూ, "పింగళా, నీవంటి యువవీరుడు నా పక్కన వుండగా, నేను దేనికీ భయపడను. ఏ మంత్ర తంత్రాలూ తెలియని నువ్వు కనబరచిన తెగువతనం, నిర్భయత్వం అమోఘం. నేను, ఆ నదీగర్భంనుంచి లేచిన నీటిబుగ్గను చూచి భయపడటం లేదు. కాని...." అంటూ పద్మపాదుడు, మరోసారి నదీగర్భంకేసి చూశాడు.



"సంశయిస్తారెందుకు? సంగతేమిటో చెప్పండి!" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు ఓ చిరునవ్వు నవ్వి, "మనం మహామాయుడినుంచి అన్ని అద్భుత శక్తుల్నీ సంగ్రహించాం. ఆ కారణంవల్ల ఈ భల్లూకపర్వత ప్రాంతాల్లో ఇంతకు ముందు విచ్చలవిడిగా విహరిస్తున్న దుష్ట శక్తులన్నీ శక్తిహీనం కావలిసింది. కాని, అలా జరగకపోగా, మరింతగా ఆ శక్తులు విజృంభిస్తున్నవి. దీనికి కారణం ఇప్పటిగ్గాని అవగాహన కాలేదు," అన్నాడు.

పింగళుడు తనకేమీ తెలియలేదన్నట్టుగా తల పంకించాడు. పద్మపాదుడు తిరిగి



ఏమో చెప్పబోయేంతలో, పొంగులువారుతున్న నదీజలంమీద అనేక భీకరాకారాలు వివిధాయుధాలు ధరించి వికృతంగా అరుస్తూ పోరాటం ప్రారంభించాయి.

ఆ దృశ్యం చూస్తూనే పింగళుడు నిలువెల్లా నీరయిపోతూ, "పద్మపాదా! ఇప్పుడేం దారి? నా జీవితంలో— ఆఖరుకు కలలో కూడా ఇన్ని వికృతాకారాల్ని చూడలేదు. వీటిమీద, మనం సంపాయించిన మహాశక్తి సంపన్నమైన ఆయుధాలను ప్రయోగించవలసిందేనా?" అన్నాడు.

పద్మపాదుడు ఓ క్షణకాలం తలవంచుకు ఊరుకుని, "ఊహూఁ" అంటూ తలాడించి పింగళుడికేసి చూస్తూ, "ఇంతవరకూ వీటిని అదుపాజ్ఞల్లో ఉంచిన మహామాయుడి సమాధిని మనం చేరగలిగాం. అతడి శక్తులు కూడా మనవశం అయాయి. కనుక, ఇప్పుడు ఈ దుష్టపిశాచగణానికి నాయకుడు లేడు. అవన్నీ నాయకత్వంకోసం పోరాడుతున్నవి. మనం ఒక పనిచేస్తే బావుంటుంది. భల్లూకకేతుడి సంగతి నువ్వు మరిచిపోలేదుగదా?" అన్నాడు.

"భల్లూకకేతుడా! అతణ్ణి ఎలా మరవగలను. అతడు ఒకప్పుడు ఈ పర్వతప్రాంతాలకు అధిపతిననికూడా చెప్పాడు. మనం,



తిరుగుప్రయాణంలో అతడికి లోహశృంఖలాలనుంచి విముక్తి కలిగిస్తామని మాట కూడా ఇచ్చాం!" అన్నాడు పింగళుడు.

"అదీ సంగతి! మనం అతడికి ఇచ్చిన మాట నిలుపుకునేందుక్కూడా ఇదే మంచి అదను. ఈ భల్లూకపర్వత ప్రాంతాలకు అధిపతి అంటూ ఎవడూ లేకపోతే, ఈ చిన్నా పెద్ద భూతాలు, తమలో తాము తగవులాడి, ఈ పరగణా అంతా అల్లకల్లోలం చేయగలవు. కనుక, మనం తిరిగీ ఆ భల్లూకకేతుడికి వీటిమీద ఆధిపత్యం ఇద్దాం," అన్నాడు.



"చాలా మంచి యోచన. అలాగే చేయండి," అన్నాడు పింగళుడు.

"అయితే, నువ్వు వెంటనే బయలుదేరు. ఆ అడవిలో ఉన్న కొలనుప్రాంతం నీకు తెలిసిందేగదా? అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి ఇక్కడకు తీసుకురా!" అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు సరేనన్నాడు. పద్మపాదుడు తన మొలనున్న మహామాయుడి వజ్రాలు తాపిన పిడిగల కత్తిని పింగళుడికి ఇస్తూ, "నీకు వాహనంగా ఆ పిశాచగార్దభం ఉంటుంది. ఈ కత్తి సాయంతో నువ్వు భల్లూకకేతుడిని సమీపించకుండానే అతడిని బంధించివున్న యినప సంకెళ్లను వూడ కొట్టవచ్చు! ఇదిగో నీ వాహనం!" అంటూ గదను గాలిలో తిప్పాడు. వెంటనే భూమి విచ్చుకుని, అందులోనుంచి ఓండ్రిస్తూ పిశాచగార్దభం బయటికి గెంతింది.

పింగళుడు, మహామాయుడి కత్తిని చేబూని పిశాచగార్దభంమీద కూర్చున్నాడు. గార్దభం గాలిలోకి లేచింది. కొండలూ, నదులూ, అడవులూ, దాటి కొద్దిసేపట్లోనే పింగళుడు, భల్లూకకేతుడు బంధింపబడి వున్న కొలనుప్రాంతం చేరాడు.

కత్తి చేతబట్టి, గాడిదమీద ఎక్కి గాలిలో ఎగురుతున్న పింగళుణ్ణి చూస్తూనే భల్లూక

కేతుడు పెద్దగా మూలిగి, "అయ్యో, ప్రభో, దేవా, గార్దభేంద్రా! నన్ను రక్షించండి. ఈ యినపగొలుసులు బద్దలుకొట్టి పుణ్యం కట్టుకోండి!" అంటూ అరవసాగాడు.

పింగళుడు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూ, కొలను ఒడ్డునే గార్దభం మీంచి దిగి, "భల్లూకా! నేను ఏదో దేవుణ్ణనుకుని నాకు గార్దభేంద్ర బిరుదు యిస్తున్నట్టుంది. నేను మనిషిని. లోగడ నన్ను ఒకమారు చూచావు. నాపేరు పింగళుడు!" అన్నాడు.

"మీరు పింగళులా...అయ్యో, ఇప్పుడు గుర్తుకొచ్చింది. మహామాయుడి సమాధి మీదికే వాడి వెడలిన ఆ ఘన మంత్రవాది పద్మపాదుడు మీ గురువుగదా?" అన్నాడు భల్లూకకేతుడు.

"అవును, నీ జ్ఞాపకశక్తి మెచ్చదగిందే!" అన్నాడు పింగళుడు.

"అయ్యో, ప్రభూ! ఆ మంత్రవేత్త సుఖంగా వున్నారా? మహామాయుడి సమాధిలో ప్రవేశించటం సాధ్యమైందా?" అని అడిగాడు భల్లూకకేతుడు ఆదుర్దాగా.

"ఆ సమాధిలో ప్రవేశించింది నేను. యిదిగో ఆ మహామాయుడి మంత్రశక్తి గల ఖడ్గం!" అంటూ పింగళుడు తన చేతనున్న కత్తిని ఝళిపించి, దాని కొనను భల్లూకకేతుడికేసి సూటిగా గురిపెట్టాడు.





మరుక్షణంలోనే కళ్లను మిరుమిట్లు కొలిపే కాంతిరేఖలు, మెరుపు వేగంతో కత్తి నుంచి బయలుదేరి, భల్లూకకేతుడిని బంధించివున్న ఇనపగొలుసును తాకినై. తక్షణం ఆ ఇనపగొలుసు పరితాడులా ఒక్కసారి భగ్గుమని మండి బూడిద అయి, నుసిగా మారి రాలిపోయింది.

భల్లూకకేతుడు తన మహాకాయాన్ని ఒక్కసారి విదిలించుకుని, లేచి నిలబడ్డాడు. అతడు కృతజ్ఞత వుట్టిపడే నేత్రాలతో, పింగళుణ్ణి సమీపించి, అతడికి సాష్టాంగపడుతూ, "ప్రభూ! మీరు నన్ను బంధవిముక్తుణ్ణి చేసి, ఎంతో కాలంగా నే పడుతున్న యాతననుంచి నన్ను కాపాడారు. మీ దయవల్ల నేను నరకబాధనుంచి బయట పడ్డాను. ఈ ఘడియనుంచి నేను మీకు దాసుణ్ణి! ఏమి సెలవు!" అన్నాడు.

"మనం యిప్పుడే బయలుదేరి పద్మపాదుణ్ణి చేరాలి. మహామాయుడు తన శక్తిని కోల్పోయిన తరవాత, భల్లూక పర్వత లోయలో గల చిన్నా పెద్ద పిశాచాలు నాయకత్వంకోసం గుద్దులాడుకుంటున్నై. నీ వంటి బలవంతుణ్ణి, శక్తిమంతుణ్ణి తిరిగీ ఆ క్షుద్రజీవాలకు నాయకుడుగా చేయాలని పద్మపాదుడి అభిప్రాయం. అలా కానప్పుడు ఆ పిశాచాలు ఊళ్లనూ, రాజ్యాలనూ పంచు





మా జీవితం! నేను, ఈ నాటినుంచి మానవులను సేవించి బతకదలిచాను! మానవుల్లో మీరు అతి సాహసోపేతులని నాకు తెలిసి వచ్చింది. నన్ను మీ దాసుడుగా స్వీకరించండి. కావాలంటే, మీ దగ్గరవున్న ఇతర దాసులమీదా, బానిసలమీదా నాకు నాయకత్వం ఇవ్వండి!" అన్నాడు.

"భేష్, నీ భక్తికీ, వినయానికీ మెచ్చాను. కాని, నిన్ను ఎలా ఉపయోగించుకోవాలన్నది, నేను తేల్చగల సమస్య కాదు పద్మపాదుడితో ముందుగా మాట్లాడి, ఆయన వుద్దేశం ఏమిటో కనుక్కోవలసి వుంది. ఇక బయలుదేరు!" అన్నాడు పింగళుడు వెనుదిరుగుతూ.

కున్న ఈ ప్రాంతాలను నానా కశ్మలం చేయవచ్చు," అన్నాడు.

పింగళుడి మాటలు వింటూనే భల్లూకకేతుడు వెలవెలపోయాడు. అతడు రెండు చేతులూ జోడించి, పింగళుడికి నమస్కరిస్తూ, "ప్రభూ! ఇక నాకు ఈ భూతగణం మీద నాయకత్వం వద్దు. ఆ పదవి అనుభవించటం ఎంత బాధాకరమో నాకు తెలిసి వచ్చింది. ఏ మంత్రవేత్తో, లేక ధైర్యసాహసాలు గల యువకుడో మామీదకు దాడి రావటం, మేము యిన్ని శక్తులూ, కుయుక్తులూ ఎరిగివుండికూడా—వాళ్ల ధాటికి తట్టుకోలేక ఎక్కడికో పారిపోవటం—అదీ

పింగళుడు ఇలా చెప్పి, తన పిశాచగార్దభాన్ని ఎక్కి కూర్చోబోయేంతలో భల్లూకకేతుడు, పిశాచగార్దభం నడుము పట్టుకుని, "ప్రభూ! మీవంటి గొప్పవారూ, గౌరవనీయులూ ఇలాంటి క్షుద్రపిశాచాలను వాహనంగా వాడుకోవటం తగదు. నా భుజాల మీద ఎక్కండి. క్షణంలో మిమ్మల్ని, మీ గురువు దగ్గిరకు చేర్చుతాను" అంటూ పిశాచగార్దభాన్ని ఒంటి చేత్తోనే ఎత్తి గిరగిరా గాలిలో తిప్పి, చెట్లమీదుగా దాన్ని ఆకాశంలోకి విసిరివేశాడు.



గార్దభం దిక్కులు పిక్కటిల్లేలా ఓండ్రిస్తూ, ఎగరటం చూచి, భల్లూక కేతుడు బిగ్గరగా నవ్వి, "ప్రభూ! ఇక రండి! నా భుజాలమీద కూర్చోండి!" అంటూ పింగళుడి ముందు మోకరిల్లాడు.

పింగళుడు సంశయించకుండా, ఎలుగొడ్డు రూపంలో వున్న భల్లూకకేతుడి భుజాలమీదికి ఎక్కి కూర్చున్నాడు. భల్లూక కేతుడు వెంటనే గాలిలోకి ఎగిరి, కళ్ళు మూసి తెరిచేంతలో పింగళుణ్ణి పద్మపాదుడు వున్న చోటుకు తెచ్చి దించాడు.

పద్మపాదుడు భల్లూకకేతుణ్ణి చూస్తూనే మందహాసంచేసి, "కులాసాయేగదా? అటు చూడు!" అంటూ నదిలో పొంగులువారుతున్న నీటిమీదా, పక్కలనే వున్న కొండ రాళ్ళ మధ్యా పోరాడుతున్న అసంఖ్యాక రక్కసులను చూపి, "వీళ్ళంతా రాజరికం కోసం ఒకళ్ళ గొంతులు ఒకరు కోసుకుంటున్నారు. నీవు వాళ్ల తగువు మాన్పి, తిరిగి వాళ్ళకు నాయకుడుగా, రాజుగా వుండాలని నేను కోరుతున్నాను," అన్నాడు.

పద్మపాదుడి మాటలు వింటూనే, భల్లూకకేతుడు దిగాలుపడిపోయి, పింగళుడికేసి దీనాతిదీనంగా చూశాడు. పింగళుడు, పద్మపాదుడితో, భల్లూకకేతుడి కోర్కె వివరించి, "నేను ఇతణ్ణి నా సేవకుడుగా తీసుకుంటాను," అన్నాడు.

"అందుకు నా అభ్యంతరం ఏమీలేదు. కాని, ఈ తగువులాడే రక్కసుల సంగతేమిటి?" అన్నాడు పద్మపాదుడు.

"వాటి సంగతి నాకు వదలండి! నేను...." అని భల్లూకకేతుడు ఏమో చెప్పబోయేంతలో ఒక్కసారిగా ఆ ప్రాంతం అంతా మార్మోగేలా, పిశాచాలన్నీ ఏక కంఠంతో, "భల్లూకకేతా! ఓహోం! ఓహోం!!" అని అరుస్తూ, పద్మపాదుడు వున్న చోటుకు పరిగెత్తుకు రాసాగాయి.

(ఇంకా వుంది)



# రహస్య ప్రభావాలు



విసుగు చెందని విక్రమార్కుడు మళ్ళీ చెట్టువద్దకు వెళ్ళి, శవాన్ని దింపి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఈ అర్ధరాత్రివేళ ఇంతగా ప్రయాసపడుతున్నావు గదా, నీ మనసులో ఏమనుకుంటున్నావో ఎవరికి తెలుస్తుంది? పూర్వం మైత్రేయమహాముని ప్రభావంవల్ల ధర్ముడి మనసులో కలిగే రహస్య భావాలు బట్టబయలు అయినట్టుగా, నీ మనసులో ఉండే ఆలోచనలుకూడా బయటపడితే ఎలా ఉంటుంది? ఒకవేళ నీకు ధర్ముడి కథ తెలియదేమో, చెబుతాను విను!" అంటూ ఈ విధంగా చెప్పాడు:

పూర్వం అయోధ్యానగరానికి సమీపంలో మైత్రేయుడనే మహాముని కఠోరమైన తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన తన యోగప్రభావంచేత మనోబుద్ధి చిత్తా

## బేతాళ కథలు

హంకారాలన్నిటినీ పూర్తిగా జయించి, నూరేళ్ళపాటు నిశ్చల సమాధిలో తపస్సు చేశాడు. ఈ ఘోర తపస్సు కారణంగా అయన శరీరమంతా చెట్టులాగా బెరడు కట్టింది. అయన తలమీద పక్షులు గూళ్ళు కట్టుకున్నాయి.

మైత్రేయమహాముని పేరు దేశదేశాలా పాకింది. తపస్సమాధిలో ఉన్న ఆయనను చూడటానికి నిత్యమూ యాత్రికులు వచ్చి పోతూండే వారు.

అయోధ్యానగరంలో కూడా ఒక సత్పురుషుడుండే వాడు. అయన పేరు ధర్ముడు. ఆయన ధర్మదేవత అవతారంలాటివాడు. విశేష ధనవంతుడై ఉండికూడా ఆయన తన డబ్బును సుఖాలకోసం ఖర్చుచేయక సాధారణ కుటుంబీకుడిలాగా జీవిస్తూ, దానిని ఇతరులకు సహాయపడటానికి వినియోగించే వాడు. ఆయనద్వారా మేలు పొందనివారు ఆ ప్రాంతాల ఒక్కరుకూడా లేరు. బీదసాదలు ఆయన పేరు తలుచుకుని దణ్ణాలు పెట్టేవారు.

అయన ప్రవర్తనలో ఎన్నడూ పొల్లూ, పొచ్చెమూ ఉండేదికాదు. ఇతరులకు ధర్మనిర్ణయాలు చేసిపెట్టటంలో కూడా ఆయన అద్భుతమైన ప్రజ్ఞ కనబరిచేవాడు. ఆయన భార్య పెద్ద గయ్యాళి, చాలా కురూపి



కూడా. అయినప్పటికీ ఆ భార్యపైన ఆయన ఎన్నడూ విసుక్కునేవాడు కాడు.

అయన మంచి కవి. ప్రజలు తన కవిత్వాన్ని మెచ్చుకుంటే ఎంత సంతోషించేవాడో, ఇతరుల కవిత్వాన్ని మెచ్చుకున్నా అంతగానూ సంతోషించేవాడు. తనలో తప్పు అన్నది లేశమన్నా లేకుండా చూసుకుంటూ, ఇతరులలో ఏపాటి మంచి ఉన్నా చూసి ఆనందించే స్వభావం కలవాడు అయన.

ధర్ముణ్ణి అందరూ "కలియుగ ధర్మరాజు" అని పిలిచేవారు. రోజూ మైత్రేయ మహామునిని చూసి వెళ్ళినట్లే యాత్రికులు ధర్ముణ్ణికూడా చూసి, అయనతో మాట్లాడి తమ ధర్మసందేహాలు తీర్చుకుని పరమానందంతో వెళ్లిపోయేవారు.

ఒకనాడు కొందరు యాత్రికులు అయోధ్యా నగరానికి వచ్చి ధర్ముడి దర్శనం చేసుకుని తరవాత మైత్రేయమహామునిని చూడబోయారు. మైత్రేయ మహాముని ఎప్పటిలాగే తపస్సమాధిలో ఉన్నాడు.

ఆయనను చూసి దణ్ణం పెట్టుకున్నాక యాత్రికులు తమలో తాము ఇలా మాట్లాడుకో సాగారు :

"తపస్సు చేసి మోక్షం సాధించటంలో ఏమంత వింత లేదు. ధర్ముడిలాగా కర్మ







చేస్తూ మోక్షం సాధించే అర్హత సంపాదించుకోవటమే నిజంగా గొప్ప సంగతి!" అన్నా డొకడు.

"దానికి సందేహం లేదు. ఈ కలియుగంలో ధర్ముడివంటివాడు మరి పుట్టడు. ఒక్కసారి అయన దర్శనం చేసుకుంటేనే సమస్త పాపాలూ విరగడ అయిపోతాయి!" అన్నాడు మరొకడు.

ఈ సంభాషణ మైత్రేయ మహాముని చెవుల పడింది. అయన తన గడ్డంచాటున ఒక చిరునవ్వు నవ్వుకున్నాడు. "మూఢులు పై మెరుగులు చూసి మోసపోతారు! యోగశక్తిచేత మనస్సును పూర్తిగా జయించిన మునులకన్న ఈ ధర్ముడు ఎక్కువా? వీడి మనసులో ఎలాటి భావాలు చెలరేగుతూ ఉంటాయో ప్రపంచానికి తెలియదు! వాటన్నిటినీ లోకం చూడకుండా దాచిపెట్టి తన ప్రవర్తనను మాత్రమే శాసించగలుగుతూవస్తున్న ఈ ధర్ముడు మోక్షార్హుడా? నా తపశ్శక్తిచేత రేపు ఉదయం లగాయతు వీడి మనసులో ఎప్పటికప్పుడు తల ఎత్తే భావాలను బట్టబయలు చేస్తాను!" అని ఆ మహాముని నిర్ణయించుకున్నాడు.

ఆ రోజు గడిచిపోయింది. మర్నాడు తెల్లవారుజామునే ధర్ముడు నిద్రలేచాడు. సూర్యోదయందాకా నిద్రపోయే అలవాటు అయనకు ఏనాడూ లేదు. అయన భార్య మటుకు జాముపొద్దెక్కి లేచేది.

నిద్రలేస్తూనే ధర్ముడు తన భార్యకేసి చూసి విసుక్కున్నాడు. "ఇది రోజూ గొడ్డులాగా పడుకుని జాము పొద్దెక్కినదాకా నిద్రపోతుంది! ఇంతకంటె ఈ మేడమీదినుంచి పడి చచ్చినా బాగుండును!" అనుకున్నాడు. తన మనసులో ఇలా అనుకున్నట్టు కూడా ధర్ముడికి స్పష్టంగా తెలియదు. కాని ఇంతలోనే అయన భార్య, ఎవరో తట్టి లేపినట్టు లేచి, పరిగెత్తుకుంటూ వెళ్ళి మేడమీదినుంచి



కిందికి ఉరికింది. ధర్ముడు అదుర్దాగా కిందికి వెళ్ళి చూసేసరికే ఆమెకు ప్రాణం పోయివున్నది !

ధర్ముడి మనసు విచారంతో కుంగి పోయింది. తన భార్య ఆ విధంగా ఆత్మ హత్య చేసుకోవటానికి కారణమేమిటో ఆయ నకు తెలియలేదు. ఆయన శవవాహకులను పిలుచుకు రావటానికి వీధిలోకి అడుగు పెట్టాడు. వెంటనే అలవాటుప్రకారం అనేక మంది బిచ్చగాళ్లు, "అయ్యా! బాబూ! ధర్మం!" అంటూ ఆయన చుట్టూ ఈగల లాగా ముసిరారు.

"ఈ బిచ్చగాళ్ళు పడి చావ! ఎంత ఇచ్చినా వీళ్ళ దరిద్రం తీరదు!" అని ధర్ముడు తన మనసులో అనుకున్నాడు. మరుక్షణమే బిచ్చగాళ్లంతా ఎక్కడివాళ్ళ క్కడ విరుచుకు పడిపోయి ప్రాణాలు వదిలారు!

ఇది చూసి ధర్ముడికి కంగారెత్తి పోయింది. తెల్లవారి లేచి ఆయన రెండు విడ్డూరాలు చూశాడు. రెండింటికి కూడా తగిన కారణం కనిపించలేదు. తాను ధర్మం చేసేలోపల ఈ బిచ్చగాళ్ళంతా చచ్చిపోయారే అన్న చింత ఆయనను చాలా బాధించింది.



మరి కొంతదూరం వెళ్ళేసరికి ఆయనకు ధాన్యపు బళ్ళూ, గడ్డిబళ్ళూ ఎదురుగా వచ్చాయి. అవి దాటిపోయినదాకా ఆయన ముందుకు సాగలేకపోయాడు. ఇంతలోనే ఆ బళ్ళన్నీ ఇరుసులు విరిగి పడిపోయాయి. వాటిని లాగే ఎడ్లు, ఎవరో కత్తులతో కోసి నట్టుగా అయిపోయి, చచ్చి పడిపోయాయి.

ఈసారి ధర్ముడికి తన మనసులో తల ఎత్తిన భావమే ప్రత్యక్షంగా జరిగిందని తెలిసిపోయింది. తన భార్య చావుకూ, బిచ్చగాళ్ళ చావుకూకూడా తానే కారకుడై ఉండాలని ఆయనకు అనుమానం కలిగి చాలా కుంగిపోయాడు.

ఆయన ఎంత నిగ్రహించుకున్నా మనసు వశం తప్పి ఏదో ఆలోచన తల ఎత్తటమూ, అది వెంటనే జరిగిపోవటమూ తటస్థించింది.

ధర్ముడు సాయంకాలంలోపల భార్యకు ఉత్తరక్రియలు చేశాడు. మనశ్శాంతికోసం ఆయన ఆ సాయంకాలం రాజుగారి సభకు వెళ్ళాడు. అక్కడ ఆ రోజు కావ్యపఠనం జరుగుతుందని ధర్ముడికి తెలుసు.

నిండు సభలో ఒక కవి తాను కొత్తగా రచించిన కావ్యం చదువుతున్నాడు. సభ నిండా కవులూ, పండితులూ కిక్కిరిసి ఉన్నారు. ధర్ముడుకూడా ఒక మూల చోటుచేసుకుని కూచున్నాడు.

కావ్యం చాలా రసవత్తరంగా ఉన్నది. కవి చదివే ప్రతి శ్లోకానికీ సభికులు, "అహా! ఓహో!" అంటున్నారు. ధర్ముడు రాసిన శ్లోకాలనుకూడా ఈ సభికులు మెచ్చు కున్నవారే. కాని ఈ కవిని వారు ఇంకా ఎక్కువగా మెచ్చుకుంటున్నారని ధర్ము డికి తోచింది.

వెంటనే ఆయనకు తెలియకుండా ఆయన మనసులో ఏదో భావం తలయెత్తింది. మరుక్షణమే, కావ్యపఠనం చేసే కవి నెత్తురు కక్కుకుని చనిపోయాడు. సభ గందర గోళంగా ముగిసింది. జరిగినదాన్ని గురించి వింతగా చెప్పుకుంటూ సభికులు ఎవరి



దారిన వారు వెళ్లిపోయారు. ధర్ముడుకూడా ఇంటికి వచ్చేశాడు. కవి చావుకు తానే కారకుడని ఆయన ఎరుగును.

"ఎంతటి రాక్షసులుకూడా తమ జీవిత మంతా చేయని దారుణ హత్యలు నేను ఒక్క రోజులోనే చేసేశాను. నా జన్మ నిరర్థకం!" అనుకుని ధర్ముడు తనను తాను కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.

ధర్ముడు ప్రాణం వదిలిన క్షణంలోనే అక్కడ మైత్రేయమహాముని కూడా సిద్ధి పొందాడు. ఇద్దరికోసమూ దేవతా విమానాలు వచ్చి వారిని తీసుకుపోయాయి.

దేవలోకంలో ఇంద్రుడు ఇద్దరికీ ఘనంగానే స్వాగతమిచ్చాడు, కాని ధర్ముడిపట్ల కొంచెం ఎక్కువ ఆదరం చూపుతూ, "మహాత్మా, మీ రాకచేత మా స్వర్గం పావనమయింది. మీరు నా ఆతిథ్యం స్వీకరించాక మోక్షానికి పంపిస్తాను!" అన్నాడు.

మైత్రేయ మహాముని ఆశ్చర్యంతో, "ఏమిటి, దేవేంద్రా? నాతోపాటు ఈ ధర్ముడుకూడా మోక్షానికి వస్తున్నాడా?" అని అడిగాడు.

"అవును, మహామునీ! మోక్షానికి మీరెంత అర్హులో, ఆయనా అంత అర్హుడే!" అని దేవేంద్రుడు సమాధానమిచ్చాడు.



బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మైత్రేయ మహామునికీ ధర్ముడికీ గల తేడా నీకు అర్థమయింది గదా? ఇద్దరూ మోక్షానికి అర్హులే ననటంలో దేవేంద్రుడు పక్షపాతం కనబరచలేదా? మనోబుద్ధి చిత్తాహంకారాలను నిగ్రహించి కఠోర తపస్సు చేసిన మైత్రేయమహామునికీ, తన మనసుమీద ఎట్టి నిగ్రహమూ లేని ధర్ముడికీ పోలిక ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది!" అన్నాడు.

"దేవేంద్రుడు పక్షపాతం ఏమీ చూపలేదు. నిజానికి మైత్రేయ మహామునీ, ధర్ముడూ కూడా సమంగా మోక్షార్హులే. ధర్ముడు సామాన్య మానవుడు, సాటి మానవులకు ఆదర్శప్రాయుడు. ఆయన మైత్రేయుడిలాగా తన సహజస్వభావాన్ని తపస్సు ద్వారా నిర్మూలించుకోలేదు; ఆ స్వభావాన్ని బుద్ధిబలంతో నిగ్రహించుకుని, తన ప్రవర్తనద్వారా సాటి మానవులకు సుఖమూ, మేలూ కలిగేలాగు చూసుకున్నాడు. చిట్టచివరలో ఆయన స్వభావంవల్ల ఇతరులకు కీడు కలిగిందంటే, అది మైత్రేయమహాముని తపఃప్రభావంగాని, ధర్ముడి స్వభావప్రభావం ఎంతమాత్రమూ కాదు. ప్రపంచంలో అందరూ ధర్ముడిలాటివారే అయితే మానవజాతీ, మానవ జీవితమూ అభివృద్ధిలోకి వస్తాయి. అలా కాక, ప్రపంచమంతా మైత్రేయమహామునిలాటివారే అయితే ప్రపంచం ఏనాడో అంతరించి పోయేది; ఎందుకంటే ఆయన మానవ స్వభావాన్నే నిర్మూలించాడు. మైత్రేయ మహాముని కర్మకు అతీతుడై మోక్షం సంపాదించుకుంటే, ధర్ముడు కర్మద్వారా మోక్షాన్ని సాధించాడు!" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)





# స్త్రీ పరాక్రమం

పూర్వం ధర్మపురాన్ని దుర్జయుడనే రాజు పాలించేవాడు. ఆయన ఏడాది కొకసారి తన సామంతుల నందరినీ ధర్మపురానికి పిలిపించి మూడు రోజులపాటు ఉత్స వాలు జరిపి, విందులూ, వినోదాలూ ఏర్పాటు చేసేవాడు.

ఒకయేడు ఇలాగే ఉత్సవం ఆరంభ మయింది. దుర్జయుడూ, ఆయన సామం తులూ విందులో కూచున్నారు. అందరూ ఆనందంలో మునిగి తేలుతున్నారు. ఒక్కొక్కరే తమతమ గొప్పలు చెప్పు కుంటున్నారు. కొందరు తమ కోటలో గల రహస్యద్వారాలను గురించీ, మరికొందరు తమవద్ద ఉన్న అరబ్బీ గుర్రాలను గురించీ, ఇంకా కొందరు తమ దేశంలో పండే అద్భుతమైన పళ్లను గురించీ—ఈ విధంగా తలా ఒక తీరునా ప్రగల్భాలు పలు కుతూ వినోదిస్తున్నారు.

కాని విజయుడనే ఒక యువకుడు మాత్రం నోరు మెదపక రాయిలాగా కూచున్నాడు. దుర్జయుడు యిది గమనించి, "ఏం, విజయా? అందరూ తమతమ గొప్పలు చెప్పుకుంటూంటే నువు ఏమీ చెప్పవేం? చెప్పుకునేటందుకు నీ కేమీ లేదా?" అని అడిగాడు.

"నేను గొప్ప చెప్పుకోదలిస్తే నా భార్య మాలినిని గురించి చెప్పుకోవాలి. అది ఇక్కడ అప్రస్తుతమని ఊరుకున్నాను, మహారాజా!" అన్నాడు విజయుడు.

"నీ భార్యలో ఉన్న గొప్పదన మేమిటో చెప్పు, విని మేముకూడా సంతోషిస్తాము! ఆమె గొప్ప అందగత్తె అవునా? లేక సంగీతంలో ప్రతిభావంతురాలా? లేక పుష్పాలంకరణలో నైపుణ్యం గలదా? నీ భార్య ఎందులో గొప్పది?" అని దుర్జయుడు నవ్వుతూ అడిగాడు.

డి. సర్వేశ్వరరావు





"మహారాజా, నా భార్యకు మీరు చెప్పిన గొప్పలన్నీ ఉన్నాయి. కాని అన్నిటినీ మించి ఆమె అసాధారణ పరాక్రమవంతురాలు! కత్తియుద్ధంలోగాని, విలువిద్యలోగాని, గదాయుద్ధంలోగాని ఆమెను ఎదుర్కొగల వారెవరూ లేరు!" అన్నాడు విజయుడు.

"ఇంతమంది యోధులమధ్య అంటున్నావు, కాస్త యోచించి మరీ మాట్లాడు!" అన్నాడు దుర్జయుడు రోషంతో.

"మహారాజా, ఈ సామంతుల మాట ఎందుకు? తమరుకూడా నా భార్య ముందు ఎంతోసేపు నిలబడలేరు. ఇది అతిశయోక్తి కాదు!" అన్నాడు విజయుడు.

దుర్జయుడికి రోషం బాగా వచ్చింది. ఆయన తన భటులను పిలిచి, "ఈ దుర్మార్గుణ్ణి వెంటనే పట్టుకుపోయి పాతాళ గృహంలో బంధించి జొన్నరొట్టెలు తిని పించండి!" అని ఆజ్ఞాపించాడు.

విజయుడు చేసేదిలేక రాజాజ్ఞ ప్రకారం అంధకార కూపంలోకి ప్రవేశించి, తనకు తిరిగి ఏ విధంగా విముక్తి కలుగుతుందా అని విచారించ సాగాడు.

ఈ లోపల విజయుడి భార్య మాలిని తన భర్తకోసం ఎదురుచూస్తూ ఉన్నది. ఉత్సవాలు ముగిసినా అతడు రాకపోవటం చూసి ఆమె తన నౌకర్లను పంపింది. వారు తిరిగి వచ్చి, మహారాజుగారు విజయుణ్ణి ఖైదు చేయించినట్టు తెలిపారు.

వెంటనే మాలిని తన గుర్రాన్ని ఆయత్తం చేయించింది; తాను కవచమూ, శిరస్త్రాణమూ ధరించింది; తన కత్తీ, ఇనప గదా, విల్లూ, అంబుల పొదీ తీసుకున్నది; ఒక వందమంది సైనికులను గుర్రాలమీద తన వెంటపెట్టుకుని ధర్మపురానికి వెళ్లింది. నగరం వెలపల మైదానంలో డేరాలు వేసి శిబిరం ఏర్పాటుచేశారు. తరవాత మాలిని ఒంటరిగా తన గుర్రంమీద బయలుదేరి దుర్జయమహారాజు వద్దకు వెళ్లింది.



పురుషవేషంలో, వీరోచితమైన దుస్తులు ధరించి వచ్చే మాలినిని చూడగానే దుర్జయుడు నిర్ఘాంతపోయాడు. ఆమె అయన కెదురుగా ఠీవిగా నిలబడి, "మహారాజా, నేను కళింగచక్రవర్తి దూతను! మీవద్ద పది లక్షల వరహాలు కప్పం వసూలు చేసుకురమ్మని మా చక్రవర్తి నన్ను పంపారు. మీరు కప్పం ఇవ్వ నిరాకరించే పక్షాన యుద్ధానికి సిద్ధమయే వచ్చాను. నలభైవేల బలం గల మా సేన మీ నగరం వెలపల విడిసి వున్నది. కప్పం కడతారో, యుద్ధమే చేస్తారో వెంటనే తెలియజేయండి!" అన్నది.

ఈ మాట వినగానే దుర్జయుడికి కాళ్ళు చల్లబడ్డాయి. కళింగ చక్రవర్తితో విరోధం పెట్టుకోవటం క్షేమంకాదు. కప్పం కడదామంటే తనవద్ద పది లక్షల సొమ్ము సిద్ధంగా లేదు. యుద్ధం చేద్దామంటే, నలభై వేల మంది గల సేనను ఎదిరించటానికి తాను సైన్యాన్ని సమీకరించాలి. ఇందుకుగాను తన సామంతులకందరికీ కబురు పంపితే తప్ప, అది సాధ్యంకాదు.

"వెంటనే సమాధానం చెప్పలేను. నాకు మూడు రోజులు వ్యవధి కావాలి!" అన్నాడు దుర్జయుడు.



"ఒకందుకు మీరు సమ్మతిస్తే మీరు కోరినట్టు మూడు రోజులు వ్యవధి ఇస్తాను; మీ కుమార్తెను నాకిచ్చి పెళ్లిచెయ్యండి!" అన్నది మాలిని.

దుర్జయుడు ఉక్కిరిబిక్కిరి అయాడు. "దానికైనా ఒకరోజు వ్యవధి ఇస్తేనేగాని చెప్పలేను. నా కుమార్తె మనసుకూడా తెలుసుకోవాలి," అన్నా డాయన.

"సరే, అలాగే కానివ్వండి. రేపు లోపుగా మీ కుమార్తెను నాకిచ్చి పెళ్లిచేసే ఏర్పాటు చేయండి. మరి రెండు రోజుల లోపల కప్పం చెల్లించండి. ఇందులో ఏది జరగకపోయినా యుద్ధం తప్పదు!" అన్నది మాలిని.

దుర్జయుడు తన కుమార్తెతో రాయబారి కోరికగురించి చెప్పాడు. రాజకుమార్తె చీదరించుకుంటూ, "ఛీ, ఆ అడంగిరేకుల వాణ్ణి నేను చేసుకోను! అసలా మనిషి నడకా, మాటా చూస్తే నాకు అడదనే తోస్తోంది! నువెందుకు బెదిరిపోతున్నావో నా కర్థంకావటం లేదు!" అన్నది.

కూతు రీమాట అనటంతో దుర్జయుడికి కొంత ధైర్యం వచ్చింది. ఆయన ఆ సాయంకాలం కళింగ దూతను తన భవనానికి పిలిపించి కొంచెంసేపు జూదం ఆడాడు. ఆడిన ప్రతి ఆటలోనూ దుర్జయుడు చిత్తుగా ఓడిపోవటం జరిగింది.

తరవాత ఇద్దరూ గుర్రాలెక్కి ఉద్యాన వనానికి వెళ్లారు.

"అస్త్ర విద్యలో మీతో పోటీ చెయ్యాలని ఉన్నది! నేను చెప్పినట్టు చేయించండి!" అన్నది మాలిని. ఆమె ఒకచోట కత్తి ఒకటి బలంగా పాతించింది. దాని కెదురుగా ఒక బంగారు వలయం వేలగట్టించింది. "మనం ఇక్కడినుంచి బాణాలు వదులుదాం. బాణం వలయంలోనుంచి వెళ్లి కత్తికి తగిలి చీలి రెండు భాగాలు కావాలి!" అన్నదామె.

దుర్జయుడు ఒకదాని వెనక ఒకటిగా మూడు బాణాలు వేశాడు. ఒకటికూడా



వలయంలోనుంచి వెళ్లలేదు. "నేను వేస్తాను చూడండి!" అంటూ మాలిని తన విలు తాడు రెండు మూడు సార్లు మోగించి, అంబుల పొదినుంచి మంచి బాణం ఒకటి తీసి, ఎక్కుపెట్టి చెవిదాకా లాగి వదిలింది. ఆ బాణం వలయంలోనుంచి వెళ్లి కత్తికి తగిలి రెండు చీలికలై పడిపోయింది. రెండు చీలికలనూ త్రాసులో రెండు వేపులా వేసి తూస్తే సమంగా తూగాయి.

ఇది కళ్లారా చూసిన దుర్జయుడికి మతి పోయినట్టయింది. ఆయన ఆ రాత్రి తన కుమార్తెతో, "నువు ఈ రాయబారి ని పెళ్లాడక తప్పదు! ఆయన ఆడంగిరేకుల వాడా? ఎంతో గొప్ప యోధుడు! ఆయన చదరంగం ఆటనుబట్టి చూసినా యుద్ధంలో ఆరితేరిన వాడని తెలిసి పోతోంది! నువు నా మాటకు ఎదురు చెప్పకు!" అంటూ తన కుమార్తెను పెళ్లికూతుర్ని చేయటానికి ఉత్తరువిచ్చాడు.

మర్నాడు మాలిని రాజుతో, "మహా రాజా, మీ కుమార్తెను నాకిచ్చి పెళ్ళి చేస్తున్నారా, లేదా?" అన్నది.

"అందుకు తగిన ఏర్పాట్లన్నీ చేస్తు న్నాను," అన్నాడు రాజు.

మాలిని తనలో తాను నవ్వుకుని, "అయితే కప్పం చెల్లించటానికి రేపటిదాకా



గడువిస్తాను. ఈలోపుగా నా చేతుల తీట తీరటానికి ఎవరైనా నాతో గదాయుద్ధంగాని కత్తియుద్ధంగాని చేస్తారా?" అన్నది. ఈ మాట అంటూ ఆమె తన ఇనపగదను గాలిలోకి ఎత్తుగా ఎగరవేసి కింద పడకుండా పట్టుకోసాగింది.

దుర్జయుడికి అది చూస్తుంటేనే ముచ్చెమటలు పోశాయి.

"యోధాగ్రేసరా, మీతో పోరగలవారు మా రాజ్యంలో ఉన్నారనుకోను. నేనా వృద్ధును!" అన్నాడు దుర్జయుడు.

"మీ రాజ్యంలో యువకులే లేరా? కనీసం మీ కారాగృహంలో సాహసవంతులైనా ఉండరా? ఎవరినైనా సరే యుద్ధానికి సిద్ధం చెయ్యండి!" అన్నది మాలిని.

వెంటనే దుర్జయుడికి విజయుడు జ్ఞాపకం వచ్చాడు. ఆయన తన భటులను పిలిచి, "పాతాళగృహంనుంచి విజయుణ్ణి తీసుకురండి!" అన్నాడు.

త్వరలోనే విజయుడు వచ్చాడు. అతన్ని చూస్తూనే మాలిని తన ఆయుధాలు కింద పెట్టి తన కవచమూ, శిరస్త్రాణమూ విప్పి, ఆడదాని దుస్తులతో అతని కాళ్ళ ముందు మోకరిల్లింది.

ఇదంతా చూస్తున్న దుర్జయుడికి నోట మాట రాలేదు.

విజయుడు తన భార్యను లేవనెత్తి దుర్జయుడి దగ్గిరికి తీసుకువచ్చి, "మహారాజా, ఈమె నా భార్య మాలిని! ఆమెను గురించి నేను అతిశయోక్తులేమీ చెప్పలేదని మీ రిప్పటికైనా ఒప్పుకుంటారనుకుంటాను!" అన్నాడు.

"ఎంత సాహసి! ఎంత పరాక్రమవంతురాలు!" అంటూ దుర్జయుడు మాలినిని మెచ్చుకున్నాడు.

ఆయన విజయుణ్ణీ మాలినినీ కొంత కాలం తన అతిథులుగా ఉంచుకుని తరవాత వారి రాజ్యానికి పంపేశాడు.





# చేపల బావి

అడవిలో జంతువులన్నీ కలిసి కొద్దిమేర దున్ని వ్యవసాయం చెయ్య నిశ్చయించాయి. మిగిలిన జంతువులతోబాటు నక్క, కుందేలూకూడా పారా పలుగూ పట్టి పని చెయ్యసాగాయి.

సూర్యుడు క్రమంగా పైకెక్కుతున్నాడు. నెత్తి మాడిపోతున్నది. కుందేలు ముచ్చెమటలు పట్టి అలిసి పోయింది. కాని పని చాలించి విశ్రాంతి తీసుకుంటే సోమరిపోతని మిగిలిన జంతువులు తిడతాయని భయపడింది. అట్లాగే పళ్ల బిగువున కొంత సేపు పనిచేసింది.

కాని కుందేలు పని అయిపోయింది. ఎక్కడైనా చల్లని మాటున విశ్రాంతి తీసుకోకపోతే ప్రాణం పోయేటట్టుగా ఉంది. చేతిలో ఏదో ముల్లు గుచ్చుకున్నట్టు నటించి అది ఇవతలికి వచ్చేసింది. తరవాత కొంచెంసేపు ఆగి, యితర జంతువులు చూడకుండా పొదల వెనకగా దౌడుతీసి తోట బావిదగ్గిరికి చేరుకున్నది.

ఈ బావి చెట్టునీడన ఉన్నది. దానికి ఒక గిలకా, గిలకమీదుగా తాడూ, తాడు రెండు చివరలా రెండు బొక్కెనలూ ఉన్నాయి. ఆ బావీ, నీడా చూడగానే కుందేలుకు ప్రాణం లేచివచ్చినట్టయింది. అది ఒక్క దూకున వెళ్లి బొక్కెనలో పడింది. మరుక్షణమే ఆ బొక్కెన కుందేలు బరువు మూలాన అడుగుకు దిగసాగింది. కుందేలుకు కంగారెత్తుకొచ్చింది. ఏమయితే అది అవుతుందనుకుని, కుందేలు బొక్కెనలో కదలక మెదలక పడుకున్నది. నీటిని తాకగానే బొక్కెన నిలిచిపోయింది. కుందేలు కంగారులో అటూ ఇటూ కొట్టుకున్నట్టయితే మునిగిపోయే పనే!

కుందేలుమీద నక్క ఒక కన్నువేసే ఉంచింది. అందుచేత, ముల్లు విరిగిందని

టి. శంభుదాసు

వంకపెట్టి కుందేలు ఇవతలికి రాగానే నక్క అటూ ఇటూ చూసి చల్లగా తనుకూడా జారుకుని కుందేలు వెనకడితే వచ్చింది. కుందేలు బొక్కెనలో దూకి బావి అడుగుకు వెళ్లిపోవటం నక్క అంతదూరంనుంచి చూసింది.

"ఈ కుందేలు ఏదో ఉపయోగం లేనిదే ఈ బావిలోకి దిగి ఇంతసేపు కూచోదు. లోపల బంగారమేమైనా దాచిందేమో!" అనుకుంటూ నక్క మెల్లిగా బావిని సమీపించి లోపలికి తొంగిచూసింది.

బావి చాలా లోతుగా ఉండటంచేత నక్కకు ఏమీ కనిపించలేదు.

"కుందేలుబావా?" అని నక్క పిలిచింది.

"ఎవరదీ? నక్కబావా?" అని లోపలినుంచి కుందేలు కేకపెట్టింది.

"అక్కడ ఏంచేస్తున్నావేం?" అని నక్క అడిగింది.

"చేపలు పడుతున్నాను, బావా! తెప్పలు తెప్పలుగా ఉన్నాయి! కావలిస్తే ఆ బొక్కెనలో ఎక్కి నువుకూడా రా?" అన్నది కుందేలు.

పైకి వచ్చివున్న బొక్కెనలోకి నక్క దూకింది. కుందేలుకన్న నక్క బరువు కావటంచేత నక్క ఎక్కిన బొక్కెన కిందికి దిగి, కుందేలు ఎక్కిన బొక్కెన పైకి రాసాగింది.

మధ్య దారిలో రెండు బొక్కెనలూ ఒకదాన్ని ఒకటి దాటేటప్పుడు కుందేలు, "నువు చేపలు పడుతూ ఉండు, బావా! నే నిప్పుడే వస్తాను!" అన్నది.

త్వరలోనే కుందేలు పైకివచ్చి బయటికి దూకి ఇంటిదారి పట్టింది.

పని పూర్తిచేసుకుని మిగిలిన జంతువులు మంచినీటి కోసం బావివద్దకు వచ్చి పైకి లాగేదాకా నక్క, పాపం, బావిలోనే ఉండిపోయింది.



# నావికుడు సింద్‌బాద్

తరవాత మే మిద్దరమూ సరదాగా కబుర్లు చెప్పు కుంటూ భోజనంచేశాం. అప్పుడు వృద్ధుడు నాతో, "బాబూ, నాకు మగపిల్లలు లేరు. ఒకతే ఆడపిల్ల ఉంది. నా ఆస్తి కంతకూ అదే వారసురాలు. నాకు బోలెడంత వర్తకమే గాక, ఈ ఊళ్లో అనేక పదవులు కూడా ఉన్నాయి. నువు నా కూతుర్ని వివాహం చేసుకున్నావంటే నా ఆస్తీ, నా పదవులూ నీకే దక్కుతాయి. నువు సుఖంగా ఉండవచ్చు. ఏమంటావు? నా కూతుర్ని పెళ్లాడి ఇక్కడే ఉండిపోవటం సమ్మతమేనా?" అని అడిగాడు.

నేను తల వంచి ఏమీ జవాబు చెప్పలేదు.

"పోనీ కనీసం నా జీవితాంతం వరకూ నైనా ఇక్కడే ఉండిపో. ఆ తరవాత నీ భార్యతోసహా మీ దేశం వెళ్లిపోదువుగాని!" అన్నాడు వృద్ధుడు.

"బాబుగారు, మీ మాట ఎలా కాదనేది?" అని జవాబిచ్చాను.

వృద్ధుడు వెంటనే కాదీని పిలిపించి, సాక్షుల సమక్షాన నాకూ తన కుమార్తెకూ వివాహం చేసేశాడు. గొప్ప విందు జరిగింది. అప్పుడే నేను నా భార్యను

ఏడవ సముద్రయానం

CHITRA

మొదటిసారి చూశాను. అమె చాలా ఆకర్ష వంతమైనదేగాక, ఆమె వంటిన వేనకువేలు దీనారాల ఖరీదుచేసే నగలూ, దుస్తులూ ఉన్నాయి. మేమిద్దరమూ చాలా కాలంపాటు అన్యోన్యంగా కాపరం చేశాం.

చివరకు నా మామగారు చనిపోయాడు. ఆయన ఉత్తరక్రియలు వైభవంగా జరిపాం. ఆయన ఆస్తీ, బానిసలూ నాకు సంక్ర మించారు. నగరంలో ఉండే వర్తకులంతా నా మామగారి స్థానంలో నన్నే తమ పెద్దను గావించారు. అందుచేత నేను అక్కడి ఆచార నియమాలను మరింత శ్రద్ధగా పాటించవలసి వచ్చింది.

ఏటా వసంతఋతువులో ఈ నగరంలో ఒక చిత్రమైన ఘటన జరుగుతుందని నాకు తెలియవచ్చింది. ఒక రోజల్లా ఇక్కడి పురుషులకు రెక్కలు ఏర్పడ తాయిట. వారు వాటి సహాయంతో ఆకాశం లోకి ఎగిరిపోయి, అవి ఉన్నంతవరకూ దిగి రారు. ఈ రెక్కలు స్త్రీలకూ, పిల్లలకూ మొలవవు. అందుచేత వారుమాత్రం నగరం లోనే ఉండిపోతారు. ఇది మొదట నా చెవు లకు విడ్డూరంగా వినిపించింది. కాని కాల క్రమాన పరిపాటి అయిపోయింది. అయితే కాలక్రమాన ఒకందుకు నేను విచారించ సాగాను—ఈ నగరంలో ఏడాది కొకసారి



రెక్కలు మొలవని మగవాణ్ణి నే నొకణ్ణే! మిగిలిన మగవాళ్లంతా ఆకాశంలోకి ఎగిరి పోగా ఆడవాళ్లతో, పిల్లలతోబాటు నేనుకూడా నగరంలో ఉండిపోయేవాణ్ణి. ఇది చూసి సిగ్గేసి, రెక్కలు ఎలా వస్తాయని ఎందరినో అడిగాను, కాని ఒకరూ చెప్పలేదు. వారికి చెప్పటం ఇష్టం లేదో, లేక ఆ రహస్యం వారికే తెలీదో! నాకుమాత్రం ఇదొక తీరని విచారమైపోయింది.

ఆ నగరంలో ఒక వర్తకుడు ఉన్నాడు. అతను నాకు అనేక విధాల రుణపడి ఉన్నాడు. ఒకనా డతనితో నేను రహస్యంగా, "ఏమోయ్, ఈసారి నువ్వు ఎగిరే టప్పుడు నేను నిన్ను వాటేసుకుంటాను. నన్నుకూడా పైకి తీసుకుపో. ఇన్ని సముద్ర యానాలు చేశాను గాని, గాలిప్రయాణం ఎన్నడూ చెయ్యలేదు. నాకు ఈ ఉపకారం నువు చేసి తీరాలి!" అన్నాను. మొదట అతను ఒప్పుకోలేదు, కాని కొంత ఉబ్బేసి నాక సరేనన్నాడు. నేను పరమానందంతో ఈ సంగతి నా భార్యకు చెప్పి, అతను ఎగిరిపోయేటప్పుడు అతని నడుము వాటేసు కున్నాను. ఇద్దరమూ గాలిలోకి ఎగిరాం.

మేము సూటిగా ఆకాశంలోకి వెళ్లి పోయాం. కొంతసేపయాక నాకు స్వర్గం సమీపంలో ఉన్నట్టూ, అక్కడి గంధర్వ






గానం వినిపించినట్టూ తోచింది. నేను వెంటనే, "అల్లా! ఏమి నీ మహిమ!" అన్నాను. ఈ మాటలు నా నోట వచ్చాయో లేదో, మరుక్షణమే నన్ను పైకి తీసుకుపోయిన వర్తకుడు నాతోసహా రాయి పడ్డట్టు కింద పడసాగాడు. మే మిద్దరమూ కింద పడి చితికిపోతామని నాకు భయం వేసింది. కాని అదృష్టవశాత్తూ మేమొక కొండ శిఖరాన దిగాం. రెక్కలు గలవాడు నాకేసి ఒక విషపు చూపు చూసి నన్నక్కడే వది లేసి తాను ఎటో ఎగిరిపోయాడు.

నేను విచారంగా ఒక రాయిమీద కూచుని, "నిజంగా నాది ఎటువంటి జన్మ!



ఒక అపద గడిచీ గడవకుండానే మరొకటి ఎదురవుతున్నది!" అనుకున్నాను. ఈ చిక్కులోనుంచి బయటపడే మార్గమేమిటా అని నేను ఆలోచిస్తూ ఉన్నంతలో ఇద్దరు అపురూప సౌందర్యం గల కుర్రాళ్లు నాకేసి వచ్చారు, వారిద్దరి చేతిలోనూ బంగారు బెత్తాలున్నాయి.

నేను ఆత్రంగా లేచి వారికి ఎదురువెళ్లి, "నాయనలారా, మిమ్మల్ని అల్లా కాపాడతాడు! ఎవరు మీరు? ఇక్కడ ఏం చేస్తున్నారు?" అన్నాను.

వారిలో ఒకడు తన బంగారు బెత్తం నా చేతి కిచ్చి, ఒకవేపు వేలు చూపి, తరవాత రెండోవాడితో చెయ్యీ, చెయ్యీ కలిపి, ఎటో వెళ్లిపోయాడు. వారు వెళ్లగానే నేను, వారిలో ఒకడు చూపినవేపు నడవసాగాను. ఒక రాయి మలుపు తిరిగేసరికి నాకొక పెద్ద సర్పం కనిపించింది. అది ఒక మనిషిని అప్పుడే రొమ్ముదాకా మింగేసింది. ఆ మనిషి నన్ను చూసి, "రక్షించండి, బాబూ! రక్షించండి!" అని అరిచాడు. నేను వెనకగా వెళ్లి ఆ సర్పం మెడమీద బంగారు బెత్తంతో గురిగా ఒక్కదెబ్బ కొట్టేసరికి ఆ సర్పం చచ్చింది. తరవాత దాని నోటినుంచి ఆ మనిషిని బయటికి లాగేశాను.







తీరా పరికించి చూస్తే అ మనిషి నన్ను ఆకాశంలోకి ఎత్తుకుపోయినవాడే. వాడితో "ఏం, బాబూ? స్నేహితుడిపట్ల అలాగేనా ప్రవర్తించవలిసింది?" అన్నాను.

"అయ్యా, నా ప్రాణం కాపాడారు, మీకు ఎంతో కృతజ్ఞుణ్ణి! కాని ముందుగా మీకొక సంగతి చెప్పాలి. నేను ఆకాశంనుంచి కింద పడిపోవటానికి కారణం మీరు స్మరించిన పేరే! ఆ పేరు మేమెవరమూ స్మరించం. అది చెవిన పడితే మా శక్తులు కాస్తా పోతాయి," అన్నాడా మనిషి.

"ఆ సంగతి నేనెరగను. నీకు పుణ్యం ఉంటుంది, నన్ను ఇల్లు చేర్చు. నేనా పేరు ఉచ్చరించనులే!" అన్నాను. నన్నతను వీపున ఎక్కించుకుని క్షణంలో మా మిద్దె మీద చేర్చాడు.

నా భార్య నన్ను మళ్లీ చూసి చాలా సంతోషించింది. "మనం ఈ మనుషుల మధ్య ఉండటం మంచిదికాదు. వీళ్లంతా పిశాచ గణాలకు పుట్టినవాళ్లు," అన్నది. అల్లా పేరుకూడా వినలేకపోవటంబట్టి ఆమె అన్నది నిజమేనని గ్రహించి, "అయితే మరి మీనాన్నకూడా వీళ్లతోటివాడేగా?" అన్నాను.

"మా నాన్న వీళ్లలోవాడు కాడు. వీళ్ల ఆచారాలెప్పుడూ ఆయన పాటించలేదు, వీళ్లు చేసే పనులేవీ చెయ్యలేదు. ఆయన పోయాడు గనక మనం ఈ దిక్కుమాలిన ఊళ్లో యిక కాపరం ఉండనవసరం లేదు. ఇల్లూ, వాకిలీ తెగనమ్ముకుని వెళ్లిపోదాం," అని నా భార్య అన్నది.

ఉన్న ఆస్తి అంతా వీలయినంత హెచ్చు ధరలకు అమ్మేసి పుష్కలంగా డబ్బు చేసుకుని, బగ్దాదు వెళ్లి అక్కడ మా యింట, నా బంధువులమధ్య ఉండాలని నా భార్య కోరిక. ఆ ప్రకారమే నేను, నా వ్యాపారదక్షత యావత్తూ వినియోగించి, మా మామ సంపాదించిన ఆస్తి యావత్తూ ఎంతో లాభానికి అమ్మి, ఆ సొమ్ముతో



ఒక ఓడా, కొంత వ్యాపార సరకూ కొన్నాను. ఆ ఓడలో నేనూ నా భార్యా ఎక్కి, దారి వెంబడి క్రయవిక్రయాలు చేసి లాభాలు సంపాదిస్తూ కాలక్రమాన బస్రా చేరాం. అక్కడినుంచి బగ్దాదు వెళ్లాం.

నేను నా భార్యతో సహా మా యింటికి వెళ్లాను. మమ్మల్ని చూసి అందరూ ఎంతో ఆనందించారు. నేను నా వ్యవహారాలన్నీ సరిచూసుకుని, నావెంట తెచ్చిన సరుకులు దుకాణాలలో పెట్టించి, బంధు మిత్రులందరి మధ్యా కూచుని నా ప్రయాణం విషయా లన్నీ చెప్పాను. ఇక ఎన్నడూ బగ్దాదు విడిచి దూరదేశాలకు పోనని వాళ్ల ఎదట ప్రమాణంకూడా చేశాను. ఆ ప్రమాణాన్ని ఈనాటివరకూ తప్పలేదు.

ఉపసంహారం

సింద్‌బాద్ నావికుడు తన కథ ముగించాక కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. అతను మూటలు మోసే సింద్‌బాద్‌వేపు తిరిగి, "నాయనా, ఈ ధనం సంపాదించటానికి నే నెన్ని అగచాట్లుపడ్డానో, చూశావా? మూటలు మోస్తూ జీవితం గడిపిన నువు నాకంటె భద్రంగా బతకలేదా? నిజం చెప్పు? నువు పేదవాడివిగా ఉండిపోయావనీ, నేను అపార ధనవంతుడి నయాననీ ఒప్పుకుంటాను. కాని భగవంతుడు మనం చేసిన ప్రయత్నాలనుబట్టే మనకు ఫలితాలిచ్చాడు," అన్నాడు.

బరువులు మోసేవాడు సింద్‌బాద్‌కు ప్రణామం చేసి, "అయ్యా, నేను అజ్ఞానంలో పాడిన ఆ పదాలను పట్టించుకోకండి!" అన్నాడు.

నావికుడు సింద్‌బాద్ నెల రోజులపాటు తన అతిథులకు విందులు చేసి, అనంతరం బరువులు మోసేవాణ్ణి తన కొలువులో చేర్చుకున్నాడు. వారు జీవితాంతంవరకూ మిత్రులుగా ఉండి సుఖంగా జీవించారు.

(అయిపోయింది)





# బెస్తవాడి అదృష్టం

హారున్ అల్ రషీద్ బాగ్దాదునగరంలో ఖలీఫాగా ఉన్న కాలంలో ఆ నగరంలోనే ఒక బెస్తవాడుండే వాడు. వాడు అతి పేద వాడు, వాడికి ప్రపంచజ్ఞానం కూడా ఏమీ లేదు. అందుచేత వాడికి ఎవరూ పిల్లనివ్వ లేదు. వాడి పేరుకూడా ఖలీఫాయే.

ఒకనాటి ఉదయం ఈ బెస్తవాడు మామూలుకన్నకూడా పెందలాడే లేచి, వల భుజాన వేసుకుని, చేపలు పట్టటానికి టైగ్రిస్ నదికి వెళ్ళాడు. వాడు చోట్లు మార్చి పది చోట్ల వల వేసినా ఒక్క చేప కూడా పడలేదు.

వాడు నది ఒడ్డున చతికలబడి, "అల్లా ఎవణ్ణి కనికరిస్తాడో తెలీదుగద! ఆయన దయ లేనిదే తిండికూడా దొరకదు," అని వేదాంతం చెప్పుకున్నాడు. చివరకు వాడు, "ఇంకొక్కసారి వల విసురుతాను. ఏమైనా పడితే పడుతుంది, లేకపోతే లేదు!" అను కుని, లేచి మోకాలులోతు నీళ్ళలోకి వెళ్లి, వల బలంగా విసిరి, చాలాసేపు ఆగి, తర వాత వలను లాగసాగాడు.

ఈసారి వలలో ఏదో పడింది. బెస్తవాడు ఎంతో చాకచక్యంతో వలను ఒడ్డుకు లాగి చూస్తే అందులో ఒక కుంటి కోతి, ఒక కన్ను గుడ్డిది, కనిపించింది. బెస్తవాడు ముందు నిర్ఘాంతపోయాడు, తరవాత వాడికి పట్టరాని కోపం వచ్చింది. ఆ కోపంలో వాడా గుడ్డికోతిని కొట్టసాగాడు.

అప్పుడా కోతి మానవభాషలో, "అగు, ఖలీఫా, నన్ను కొట్టకు! నన్నిక్కడ చెట్టుకు కట్టిపెట్టి మరొకసారి వల వెయ్యి. నీ కోరిక తీరుతుంది!" అన్నది.

బెస్తవాడు సరేనని మరొకసారి వల వేశాడు. ఈసారికూడా వలలో కోతే పడింది. ఈ కోతి మొదటి కోతికన్నకూడా వికారంగా ఉన్నది. దాని కళ్లకు కాటుకా, పాదాలకు

కె. ఆనందమోహన్‌రావు





గోరింట ఎరుపూ ఉన్నాయి. అది చినిగిన చొక్కా తొడుక్కొని ఉన్నది.

"అల్లా మహిమ! ఇవాళ నదిలో వుండే చేపలన్నీ కోతులైపోయాయి!" అనుకున్నాడు బెస్తవాడు. తరవాత వాడు ఒళ్లు మరిచిన కోపంతో బెత్తం ఒకటి తీసుకుని మొదటి కోతిమీదికి వెళుతూ, "పాపిష్టి దానా, నువు చెప్పే సలహా ఇదా? చూడు ఇవాళ నిన్నేం చేస్తానో!" అన్నాడు.

"ఆగు, ఖలీఫా! తొందరపడకు. నా అన్న సలహా తీసుకుని వాడు చెప్పినట్టు చెయ్యి. నువ్వు తప్పక బాగుపడతావు!" అన్నది మొదటి కోతి.

బెస్తవాడు రెండో కోతివంక తిరిగి, "నన్నేం చెయ్యమంటావు?" అని అడిగాడు.

"నన్నిక్కడే వదిలి మరొకసారి వల వెయ్యి!" అన్నది రెండో కోతి.

బెస్తవాడు సరేనని మూడోమారు వల వేశాడు. ఈ సారికూడా వాడి వలలో కోతే చిక్కింది. ఈ కోతి వంటినిండా ఎర్ర బొచ్చున్నది. దాని కళ్లకు కాటుకా, పాదాలకు గోరింట ఎరుపూ ఉన్నాయి. అది ఒక నీలం చొక్కా తొడుక్కొని ఉన్నది.

"అరే అల్లా! ఇవాళ ఏదో ప్రళయం వచ్చింది. ఇక ఈ నదిలో కోతులు తప్ప చేపలు పడవు!" అన్నాడు బెస్తవాడు ఆశ్చర్యంతో. తరవాత వాడు మూడో కోతి కేసి తిరిగి, "ఇంతకూ ఎవరు నువు?" అని అడిగాడు.

"నే నెవరినో, ఎరగవా, ఖలీఫా? ఈ నగరంలో అబూసాదా అనే యూదువర్తకుల నాయకుడున్నాడు. నేను ఆ వర్తకుడి అదృష్టాన్ని. నా మూలంగా అతను రోజూ పది దీనారాల లాభం కళ్లజూస్తాడు!" అన్నది మూడో కోతి.

బెస్తవాడు మొదటి కోతికేసి తిరిగి, "నువూ ఉన్నావు పాపిష్టి మొహానివి! పొద్దునే లేచి నీ మొహం చూశాను, నాకిన్ని



అగచాట్లు వచ్చాయి!" అని దాన్ని తీవ్రంగా తిట్టనారంభించాడు.

"దాని జోలికి పోకు. నేను చెప్పినట్టు చెయ్యి. మరొకసారి వలవేసి అందులో ఏం పడేదీ నాకు చూపించు!" అన్నది మూడో కోతి.

"అలాగే చేస్తాను, కోతిరాజా!" అంటూ బెస్తవాడు మళ్ళీ వల వేశాడు. ఈసారి వాడి వలలో ఒక అద్భుతమైన చేప పడింది. దాని తలా, రెక్కలూ చాలా విశాలంగా ఉన్నాయి. దాని కళ్లు బంగారు పతకాల లాగా మెరుస్తున్నాయి. దాన్ని చూసి మూడో కోతి ఇలా అన్నది:



"ఒక బుట్ట అడుగున గరిక పరచు. దానిమీద ఈ చేపను పెట్టి మళ్లీ గరికతో కప్పు. తరవాత ఆ బుట్ట పట్టుకుని బాగ్దాదు నడిబజారుకు వెళ్లు. దారిలో ఎవరు పలకరించినా మాట్లాడకు. అక్కడ అబూసాదా దుకాణం ఉంటుంది. నువు నేరుగా అబూసాదా వద్దకు వెళ్లి నీ బుట్టలోఉన్న చేపను చూపు. 'దీన్ని ఇంకెవరికైనా చూపావా?' అని అయన అడుగుతాడు. చూపలేదని చెప్పు. అయన చేపను తీసుకుని నీ కొక దీనారం ఇవ్వబోతాడు. దాన్ని తీసుకోకు. రెండు దీనారా లివ్వబోతాడు. అదీ తీసుకోకు. అయన అ చేప ఎత్తు బంగారం ఇస్తానన్నప్పటికీ తీసుకోకు. చివరకాయన నిన్ను, 'నీకు కావలిసిం దేమిటి?' అని అడుగుతాడు. 'నాకొక చిన్న ప్రమాణం చాలు!' అని చెప్పు. ఆ ప్రమాణం ఏమిటని అడుగుతాడు. 'అయ్యా, మీరు నలుగురి మధ్యా నిలబడి, "నా అదృష్టాన్ని నీకిచ్చి, నీ అదృష్టాన్ని నేను తీసుకుంటున్నాను!" అని ప్రమాణం చెయ్యండి, అని కోరుకో. అయన అలాగే చేస్తాడు. అప్పుడు నేను నీదాన నవుతాను. ఆ తరవాత నీకు నేను రోజుకు పది దీనారాలచొప్పున లాభం వచ్చేటట్టు సహాయం చేస్తాను."



బెస్తవాడు ఈ మాటలకు పరమానందం చెంది మూడు కోతులనూ కట్టు విప్పాడు. అవి వెంటనే నదిలోకి దూకేశాయి. తరవాత వాడు తాను పట్టిన చేపను కోతి చెప్పిన ప్రకారమే ఒక బుట్టలో పెట్టి గరిక కప్పి, ఆ బుట్ట పట్టుకుని ఆడుతూ పాడుతూ పెద్ద బజారున బయలుదేరాడు. దారిలో ఎంతో మంది పలకరించారు గానీ వాడు వారి మాటలేవీ వినిపించుకోలేదు.

అబూసాదా చేపను చూసి చాలా ముచ్చట పడ్డాడు. ఆయన ఆ చేపను తన నౌకరు చేతికిచ్చి తన కుమార్తెకు పంపించి, బెస్తవాడి చేతిలో ఒక దీనారం పెట్టాడు.

తన జన్మలో ఎన్నడూ బంగారునాణెం కళ్లచూడని బెస్త ఖలీఫాకు ఆ దీనారం చేతిలో పడగానే పరమానందం కలిగింది. వాడు దాన్ని తీసుకుని బయలుదేరినాక కోతి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. వెంటనే వాడు వెనక్కు వచ్చి తాను తీసుకున్న దీనారాన్ని కింద గిరవాటువేసి, "నాకిది వద్దు! నా చేపనే ఇప్పించండి!" అన్నాడు కోపంగా.

"అదేమిత్రా! ఆశాపాతకుడా? కావలిస్తే అయిదు దీనారాలిస్తాను పుచ్చుకో. ఆ చేప నిజంగా అంత విలువ చెయ్యదు," అన్నాడు అబూసాదా.



అయిదు బంగారు దీనారాలు చూసి బెస్త వాడికి కళ్లు తిరిగి పోయాయి. "ఇంతబంగారమే? బగ్దాదులిలో ఖలీఫావద్ద కుడా ఇంత బంగారం ఉండదు! నా అదృష్టం!" అనుకుంటూ వాడు ఆ డబ్బు తీసుకుని వెళ్లిపోసాగాడు. కాని కొంతదూరం వెళ్లాక వాడికి కోతిరాజు సలహా జ్ఞాపకం వచ్చింది.

బెస్తవాడు మళ్లా తిరిగివచ్చి, అయిదు దీనారాలూ కింద గిరవాటువేసి, "నా చేప నాకిప్పించండి!" అన్నాడు.

అబూసాదా నిర్ఘాంతపోయి, "ఒక్క చేపకు అయిదు దీనారాలిస్తే చాలదంటావే? దాని వెల ఎంతరా?" అని అడిగాడు.

"ఒక్క చిన్న ప్రమాణం!" అన్నాడు బెస్తవాడు నిబ్బరంగా.

ఈ బెస్తవెధవ తనను యూదుమతం వదిలి ఇస్లాముమతం పుచ్చుకోమంటున్నాడని కోపంవచ్చి, అబూసాదా తన నౌకర్లతో, "ఈ వెధవను మెత్తగా తన్నండి!" అన్నాడు.

వాళ్లు బెస్తవాడిమీద పడి తమ యజమాని ఆగమన్నదాకా తన్నారు. అంతా అయినాక బెస్తవాడు, "ఇటువంటి దెబ్బలు ఈ బెస్త ఖలీఫాకు ఒక లెక్క కాదు!" అన్నాడు నవ్వుతూ.

అబూసాదాకూడా నవ్వి, "నన్ను మతం మార్చుకోమంటే తంతానా, చంపుతానా?





నీకేంకావాలో మర్యాదగా అడిగి పుచ్చుకు పో!" అన్నాడు.

"అయ్యా, తమవంటి మనిషి ఇస్లాము మతం పుచ్చుకుంటే ఇస్లాము మతానికి ఒరిగేదిలేదు. నాకు కావలసిన ప్రమాణం వేరే ఉన్నది," అంటూ బెస్తవాడు అసలు సంగతి చెప్పాడు.

"ఈ భాగ్యానికి ఇంత రాద్ధాంతం చెయ్యాలా?" అంటూ అబూసాదా, తన అదృష్టం బెస్తవాడికి పట్టి, వాడి అదృష్టం తనకు పట్టాలని ప్రమాణం చేశాడు.

బెస్తవాడికి తృప్తికలిగింది. వాడు ఖాళీ బుట్ట తీసుకుని అప్పటికప్పుడే నదివద్దకు



పరిగెత్తి వలవేశాడు. అ వలలో వాడికి రక రకాల చేపలు దొరికాయి. సరిగా ఆ సమ యానికే అటుగా ఒక స్త్రీ వచ్చి ఒక దీనారం ఇచ్చి వాడివద్ద కొన్ని చేపలు కొన్నది. తర వాత ఇంకొక నౌకరు వచ్చి ఇంకో దీనారం ఇచ్చి మరికొన్ని చేపలు కొనుక్కున్నాడు.

ఈ విధంగా చీకటి పడేలోపల బెస్తవాడు తాను పట్టిన చేపలన్నీ ఆ దారినపోయే వారికి అమ్మేసి పది బంగారు దీనారాలు సంపాదించుకున్నాడు.

పదిరోజులు వరసగా ఇలాగే జరిగింది. జన్మలో ఎన్నడూ డబ్బన్నది కళ్లజూసి ఎర గని బెస్త ఖలీఫావద్ద నూరు బంగారు దీనా రాలు చేరాయి.

ఈ బెస్తవాడుండే గుడిసె వర్తకుల ఇళ్లుండే వీధి చివరన ఉన్నది. పదోరోజు రాత్రి వాడు బాగా గంజాయి తాగి, ఆ మైకంలో ఈవిధంగా ఆలోచన సాగించాడు:

"నేను చాలా పేదవాణ్ణని అందరూ అనుకుంటున్నారు. నా దగ్గిర నూరు దీనా రాలున్న సంగతి ఎవడికీ తెలియదు. కాని ఈ సంగతి ఎంతకాలం రహస్యంగా దాగు తుంది? ఎప్పటికైనా ఇది బయటికి పొక్కు తుంది! ఇది ఖలీఫాగారి దాకా పోతుంది. ఆయన తన ఖజనా ఖాళీ అయిపోగానే



నా వద్దకు వచ్చి, 'ఒరే, నీ దగ్గిర నూరు దీనారాలున్నాయట. నా దగ్గిర ప్రస్తుతం డబ్బు లేదు. వాటిని నాకు అప్పియ్యి!' అని అడుగుతారు. నేను, 'హుజూర్, నేను అతి పేద బెస్తవాణ్ణి. నా దగ్గిర బంగారం ఎట్లా ఉంటుంది?' అంటాను. కాని ఆయన నా మాట నమ్మక తన భటులచేత నన్ను కొరడాలతో కొట్టిస్తారు. అందుచేత నేనిప్పుడు చేయవలిసిందేమిటంటే నా శరీరాన్ని కొరడా దెబ్బలకు అలవాటు చేసుకోవటం!"

ఈ విధంగా ఆలోచించినవాడై బెస్త వాడు ఒక కొరడా తీసుకుని కొట్టుకుంటూ, ఒక్కొక్క దెబ్బకూ, "అయ్యో, నాదగ్గిర డబ్బు లేదు!", "అన్నీ అబద్ధాలే!" అని అరవసాగాడు.

ఈ కేకలూ, కొరడాదెబ్బల చప్పుడూ విని ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు నిద్ర లేచారు. బెస్తవాడి ఇంట దొంగలు పడ్డా రని వాళ్ళు అనుకున్నారు. కాని దగ్గిరికి వచ్చి చూస్తే ఇంటి తలుపులు లోపలి వైపున గడియలు పెట్టివున్నాయి.

ఇరుగు పొరుగువారిలో కొందరు బెస్త వాడి ఇంటిపక్క వున్న ఇళ్ళ డాబాలమీది నుంచి బెస్తవాడి ఆవరణలోకి దూకి, వాడు తనను తాను కొరడాతో కొట్టుకుంటూ



ఉండటం చూసి, "ఒరే, నీకేమైనా మతి పోయిందా? ఎందు కిలా కొట్టుకుంటు న్నావు?" అని అడిగారు.

నిజానికి బెస్తవాడు అమాయకుడు. తాను ఏదైతే ఎవరికీ తెలియకుండా రహస్యంగా ఉంచుదా మనుకుంటున్నాడో ఆ డబ్బు సంగతే వారితో చెప్పేశాడు. వాళ్లు వాడి అమాయికత్వానికి నవ్వుకుంటూ, "ఈ డబ్బు నువు సుఖపడటానికి రాలేదులే!" అని తమ దారిన తాము వెళ్లిపోయారు.

మొత్తంమీద వాళ్లు అన్నంతా అయింది. బెస్తవాడు మరునాడు ఉదయం చేపలు పట్టబోతూ, తన డబ్బును ఇంట్లో ఉంచితే

ఎక్కడ దొంగలు దోచిపోతారో అని, తన అంగరఖా లోపలివైపున ఒక జేబు కుట్టి, నూరు దీనారాల మూటను అందులో పెట్టుకుని, తన వలా, బుట్టలూ, చేతికర్రా పట్టుకుని నదికి బయలుదేరాడు.

ఆ రోజు వాడికి ఎన్ని చోట్ల వలవేసినా ఒక్క చేపకూడా పడలేదు. మిట్ట మధ్యాన్నందాకా వాడు నది ఎగువకు కదిలి వెళ్ళాడు, కాని లాభం లేకపోయింది. చివరకు వాడు ప్రాణంవిసిగి, మొలలోతు నీటిలో నిలబడి తన బలంకొద్దీ వలను నదిలోకి విసిరాడు. ఈ విసురుకు లోపలి జేబులో ఉన్న దీనారాల మూట కాస్తా జేబులోనుంచి పైకి ఎగిరి నీటిలో పడి మునిగిపోయింది.

వెంటనే వాడు అదుర్దాగా తన బట్టలు విప్పి ఒడ్డున పెట్టి, నదిలోకి ఉరికాడు. వాడు ఎంతోసేపు నది అడుగున వెతికాడు గాని పోయిన డబ్బుమాత్రం దొరకలేదు. చిట్టచివరకు వాడు అలిసి, ప్రాణం సొమ్మసిల్లి ఒడ్డు చేరుకుని చూసుకుంటే బట్టలు కాస్తా మాయమయాయి; వాటిని ఎవరో కాజేశారు. దీనితో బెస్తవాడికి మతిపోయినట్టయింది. వాడు వలను తన వంటికి చుట్టుకుని వెర్రెత్తినవాడిలాగా కేకలు పెడుతూ, గెంతనారంభించాడు.



## 2

ఇబన్ అల్ కిర్నాస్ అని బాగ్దాదునగరంలో ఒక గొప్ప నగల వర్తకుడున్నాడు. ఈయన ఖలీఫా హారున్ అల్ రషీద్‌కు ఆప్త మిత్రుడు. ఆయన ఖలీఫాకు అప్పుడప్పుడూ అప్పుపెడుతూ ఉంటాడని ప్రతీతి. బాగ్దాద్ నగరానికి విలువగల ఏ కొత్త నగ వచ్చినా, బానిసపిల్ల వచ్చినా ముందుగా అల్ కిర్నాస్‌కు చూపకుండా ఇతర వర్తకులకు చూపే ఆచారం లేదు.

ఒకనాడు ఈ నగలవర్తకుడి వద్దకు ఒక బానిసను తెచ్చారు. ఆ పిల్ల అపూర్వ సౌందర్యరాశి. అందానికి తోడు ఆమె చక్కగా పాడగలదు, జంత్ర వాద్యాలు వాయించగలదు. ఆమె పేరు కుతల్ కులుబ్. నగలవర్తకుడు ఆమెను అయిదు వేల దీనారాలిచ్చి కొని, ఆమెకు మరొక వెయ్యి దీనారాల ఆభరణాలు పెట్టి, ఆమెను తన మిత్రుడైన ఖలీఫా వద్దకు తీసుకు వెళ్ళి, కానుకగా సమర్పించాడు.

కుతల్ కులుబ్ తనవద్దకు వచ్చినది మొదలు ఖలీఫా జుబేదారాణికేసిగాని, తన ఇతర భార్యలకేసిగాని చూడలేదు. ఆయన రోజులతరబడి ఆమె ఇంటనే ఉంటూ శుక్రవారాలప్పుడు మాత్రం ప్రార్థనలకు మసీదుకు వెళ్లుతూ వచ్చాడు.





ఒక్క బానిసపిల్ల మూలాన ప్రభువు తమకేసి చూడకపోవటం అంతఃపుర స్త్రీలకు నచ్చలేదు; ఆయన రాజకీయ వ్యవహారాలు చూడకపోవటం వజీర్లకూ నచ్చలేదు. పెద్ద వజీరయిన జాఫర్ ఖలీఫాతో మర్యాదగా, "ఏలినవారు ఒక బానిసపిల్ల కోసం మిగిలిన అన్ని సుఖాలు వదులుకోవటం ఏమాత్రం భావ్యంకాదు. మనం గుర్రాల మీద స్వారీచేసి, అడవికి వేటకు వెళ్ళి ఎంతో కాలమయింది!" అన్నాడు.

"అయితే ఇవాళే వేటకు పోదాం పద!" అన్నాడు ఖలీఫా.

త్వరలోనే వారు కొంత సైనిక బలాన్ని వెంటబెట్టుకుని గుర్రాలెక్కి బయలుదేరారు. ఎండ జాస్తిగా ఉన్నది. వారు నగరం దాటి చాలా దూరం వచ్చారు. ఖలీఫాకు దాహమయింది. నీటికోసం ఆయన చుట్టూ కలయ చూడటంలో దూరాన ఒక దిబ్బ పైన ఏదో వింత ఆకారం పొడగట్టింది.

"ఆ కనబడేదేమిటో పోల్చుకోగలవా, జాఫర్?" అని ఖలీఫా తన వజీరు నడిగాడు.

"ఎవరో మనిషిలాగున్నాడు, ప్రభూ! ఏ తోటమాలిగాని అయివుంటాడు. బహుశా వాడు మన దాహం తీర్చగలడు. నేను వెళ్ళి రానా?" అన్నాడు జాఫర్.

"మన బలగం వెనకబడ్డారు. వారు వచ్చినదాకా నువ్విక్కడే ఉండు. ఈలోపల నేను వెళ్ళి దాహం తీర్చుకుని వస్తాను," అంటూ ఖలీఫా తన గుర్రాన్ని ముందుకు పరిగెత్తించాడు.

ఆయన దిబ్బను సమీపించేసరికి దాని మీద ఉన్నది మనిషేనని తేలింది. వాడు తన శరీరానికి వల చుట్టుకుని ఉన్నాడు, వాడి జుట్టు రేగివున్నది. కళ్ళు ఎర్రగా జ్యోతులల్లే ఉన్నాయి.

వాడు మరెవరో కాదు, మన బెస్త ఖలీఫాయే!

(ముగింపు వచ్చేసంచికలో)






## 2

[ట్రోయ్ పతనానంతరం ఇంటికి బయలుదేరిన రూపధరుడూ, అతని అనుచరులూ, నౌకలూ తుఫానులో పడి చాలారోజులు కొట్టుకుపోయి చిట్టచివరకు ఒక దీవిని చేరుకున్నారు. ఆ దీవిలో ఉండేవాళ్లను గురించి తెలుసుకోవటానికి బయలుదేరి, రూపధరుడు పన్నెండుమంది అనుచరులతో సహా ఒక గుహలో చిక్కుకున్నాడు. ఆ గుహ ఫాలలోచనులనే జాతికి చెందిన రాక్షసుడిది.]

ఆ రాక్షసుడి గొంతు వినేసరికల్లా గ్రీకులకు గుండెలు అవిసి పోయాయి.

రూపధరుడే సాహసించి రాక్షసుడితో ఈ విధంగా అన్నాడు :

"అయ్యా, మేము ట్రోయ్‌నుంచి తిరిగి ఇళ్లకు పోతున్న గ్రీకులము. దైవవశాన సముద్రంమీద పెనుగాలి వీచి మా నౌకలు మార్గం తప్పాయి. మేమిక్కడికి వచ్చి పడ్డాము. మా ప్రభువైన రారాజు జగద్విఖ్యాతి కన్నవాడు. ఆయన ఎన్నో దేశాలను జయించాడు, ట్రోయ్‌ని భస్మీపటలం చేశాడు. మేము మీకు అభ్యాగతులము. అభ్యాగతి దేవుడిలాటి వాడంటారు. కనుక తమరు మాకు తగురీతిగా ఆతిథ్యం ఇచ్చి, మమ్మల్ని అన్ని ఆపదలనుంచీ కాపాడవలసిందని మా ప్రార్థన!"

ఈ మాటలు విని రాక్షసుడు వికటాట్టహాసంచేసి, "ఓరీ మతిమాలినవాడా! మేము



దేవతలనూ గీవతలనూ లక్ష్యపెట్టేవాళ్లం కాము. మా ఫాలలోచనులముందు ఏ దేవతలూ అగలేరు, తెలిసిందా? ఇంతకూ మీ పడవను ఎక్కడ లంగరు వేశారు? దగ్గరలోనేనా, దూరాననా? ఆ సంగతి ముందు చెప్పు!" అన్నాడు.

రాక్షసు డీప్రశ్న ఎందుకు వేశాడో రూపధరుడికి అర్థమయింది. అతను యుక్తిగా, "మాకింకా పడవ ఎక్కడిది? అది మీతీరానగల కొండలకు తగిలి ధ్వంసమైపోయింది. నేనూ ఈ నా అనుచరులూ తప్ప మిగిలినవాళ్లందరినీ వరుణదేవుడు తన పొట్టనపెట్టుకున్నాడు!" అన్నాడు.



రాక్షసుడింకేమీ అనలేదు. వాడు చేతులు చాచి ఇద్దరు గ్రీకులను అందుకుని, నేలకు వేసి కొట్టిచంపి, వండుకుని ఎముకలు కూడా విడిచిపెట్టకుండా తినేశాడు. ఇది కళ్లారా చూసిన రూపధరుడికీ, అతని అనుచరులకూ ప్రాణాలు నీరసించిపోయాయి.

ఫాలలోచనుడు తన భోజనం పూర్తిచేసి అయిదారు కడవల పచ్చిపాలు తాగేసి, తన గొర్రెలమధ్యన చాచుకుని పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

రూపధరుడు కత్తిదూసి నిలబడ్డాడు. ఆ రాక్షసుడి రొమ్ము తడివి గుండె ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని ఒక్కపోటుతో వాణ్ణి చంపేద్దామని అతను ఆలోచించాడు. కాని అంతలోనే అతని కొక సంగతి జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే, గుహకు రాక్షసుడు అడ్డంపెట్టిన రాయిని కదిలించటం తనవల్లా, తన అనుచరులవల్లా అయేపనిగాదు. ఇప్పుడు గనక తాను రాక్షసుణ్ణి చంపేసినట్టయితే, తానూ, తన అనుచరులూ ఈ గుహలోనే తిండికి మాడి ఘోరమైన చావు చావవలిసి ఉంటుంది. తమను రక్షించగలవారెవరూ ఉండరు. అందుచేత రూపధరుడు కత్తిని ఒరలో పెట్టేసి తన యథాస్థానంలో పడుకున్నాడు, ఆ రాత్రి అతనికి నిద్రలేదు.





తెల్లవారింది. రాక్షసుడు లేచి, నిప్పుచేసి, తన పశువులన్నిటినీ పాలుపితికి, దూడలను వదిలాడు. తరవాత మరి ఇద్దరు గ్రీకులను చంపి తినేసి, మందలను తోలుకుని గుహ బయటికి వెళ్లాడు. ఈసారి వాడు పెద్దరాయిని గుహకు అడ్డంగా పెట్టి, గ్రీకులు తప్పించుకుపోకుండా చేశాడు.



ఆ రాక్షసుడు తన మందలను మేపుకోవటానికి వెళ్లాక, రూపధరుడు కాలు కాలిన పిల్లిలాగా అటూ ఇటూ పచారుచేయసాగాడు. తన అనుచరులను చంపితిన్న ఈ రాక్షసుడిపైన ఎట్లా పగతీర్చుకోవాలా అన్న సమస్య అతన్ని బాధిస్తున్నది. ఏదైనా ఉపాయం తట్టేటట్టు చేయుమని అతను తన ఇష్టదేవత అయిన బుద్ధిమతీదేవిని ఎంతగానో ప్రార్థించాడు.

చివరకు అతనికి ఒక ఉపాయం తట్టింది. ఆ గుహలో ఉండే రాక్షసుడు, తనకు చేతికర్రగా ఉపయోగిస్తుందని, కణుపులు లేని నిడుపైన కర్ర ఒకటి తెచ్చి గుహలో ఉంచుకున్నాడు. అది ఇంకా పచ్చిగానే ఉన్నది. అది రమారమి తెరచాప స్తంభమంత లావున్నది. అంతే పొడుగుకూడా ఉన్నది. రూపధరుడు ఈ కర్రలో మనిషి ఎత్తు ముక్క కోయించాడు. దాని కొన సన్నగా చెక్కి, నిప్పులో కాల్చి గట్టిచేసి గుహలో ఉన్న పేడకుప్పలో దాచాడు. ఆ రాత్రి రాక్షసుడు నిద్రపోయేటప్పుడు ఆ కర్రమొనతో రాక్షసుడి ఒంటికన్ను కాస్తా పొడిచి, వాణ్ణి గుడ్డివాణ్ణి చేసెయ్యాలని రూపధరుడి ఆలోచన. ఇందుకుగాను ఒక్క మనిషి చాలడు. తనకు సాయపడటానికి తన అనుచరులలో మరి నలుగురిని రూపధరుడు ఎన్నుకున్నాడు.

సాయంకాలం కాగానే రాక్షసుడు తన మందలను తోలుకుని గుహకు తిరిగి వచ్చాడు. గొర్రెలనూ, మేకలనూ పాలుతీసినాక గుహద్వారం ఎప్పటిలాగే మూశాడు;





రాక్షసుడు రూపధరుడు అందించిన కొయ్యపాత్ర అందుకుని అందులోని సారాను గడగడా తాగేశాడు. వాడి కది చాలా రుచిగా కనిపించింది.

"ఈ సారా ఇంకా వుంటే పొయ్యి. నీ పేరేమిటో కూడా చెప్పు! నీకు మా ఆచారం ప్రకారం అతిథిసత్కారం చేస్తాను. ఇక్కడ మేముకూడా ద్రాక్షరసం తాగుతాము గాని, దానికీ రుచి లేనేలేదు!" అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడీ మాట అన్నప్పటికి రూపధరుడు తగు జాగర్తమీదనే ఉన్నాడు. "నా పేరు ఉత్తుత్త మనిషి! అన్న ప్రకారం నాకు అతిథి సత్కారం చెయ్యాలిసుమా!" అన్నా డతను. అతను రాక్షసుడికి కొయ్యపాత్రతో మూడుసార్లు సారా ఇచ్చాడు.

"అయితే, ఉత్తుత్త మనిషీ, నిన్ను ఆఖరుకు తింటాను. మిగిలినవాళ్లందరూ అయిపోయేదాకా నీ జోలికి రాను. ఇదే మేము చేసే అతిథి సత్కారం!" అన్నాడు రాక్షసుడు. ఈ మాట అంటూనే వాడు మైకం వచ్చి గొడ్డులా పడిపోయి నిద్రపోసాగాడు.

రూపధరుడు పేడకుప్పలోనుంచి కఱ్ఱను తీసి దాని కొనను నిప్పులలో పెట్టి, తన అనుచరులకు ధైర్యం రాగలందులకు

తరవాత మరి ఇద్దరు గ్రీకులను పట్టుకుని చంపి తిన్నాడు.

ఈలోపుగా రూపధరుడు ఒక కొయ్యపాత్రలో తనవద్ద వున్న సారా నింపి, దాన్ని పట్టుకుని రాక్షసుణ్ణి సమీపించి, అతడితో ఈ విధంగా అన్నాడు:

"ఫాలలోచనా, ఇంద, ఈ సారాయి రుచిచూడు. నీకు నరమాంసం రుచి తెలుసు గాని సారా రుచి తెలియదు. ఈ దివ్యమైన సారాయిని నీకోసం తెచ్చాను. కాని నువు చాలా చెడ్డవాడివి. మామీద నీకు కాస్త అయినా కనికరం లేదు. ఇలా ప్రవర్తించినట్టయితే ఎవరైనా నిన్ను చూడ వస్తారా?"





ప్రోత్సాహ వచనాలు చెప్పాడు. కొద్దిసేపట్లో కఱ్ఱ కొన ఎఱ్ఱగా కాలింది. రూపధరుడి అనుచరులు మొండి ధైర్యం తెచ్చుకున్నారు. వారి సహాయంతో రూపధరుడు ఆ కఱ్ఱను రాక్షసుడున్న చోటికి తీసుకుపోయి, ఎఱ్ఱగా కాలే దాని కొనను రాక్షసుడి కంట్లో బలంగా గుచ్చేశాడు.



గుహ యావత్తూ దద్దరిల్లే పెడబొబ్బతో రాక్షసుడు లేచాడు. వాడు తన కంట్లో గుచ్చుకునివున్న కఱ్ఱను ఊడబెరికి దూరంగా పారేసి, ఇతర ఫాలలోచనుల కోసం కేకలు పెట్టసాగాడు. ఆ పరిసరాలలో ఉన్న గుహలలో నివసించే రాక్షసులు వాడి పెడబొబ్బలు విని పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్లు గుహ బయటినుంచి, "ఏం జరిగింది? ఎందుకలా రంకెలు పెట్టి, అర్ధరాత్రివేళ మా నిద్రను చెడగొట్టుతున్నావు? ఎవరన్నా నీ మందలను ఎత్తుకుపోయారా? ఎవరన్నా నిన్ను బలంతోగాని, యుక్తితో గాని చంపుతున్నారా?" అని అడిగారు.

"అవునవును. నన్ను ఉత్తుత్త మనిషి యుక్తితో చంపుతున్నాడు," అన్నాడు గుహలో వున్న రాక్షసుడు.

"ఉత్తుత్త మనిషి చంపటమేమిటి? వెఱ్ఱివేషాలు వెయ్యక పడుకో. ఒంట్లో సరిగా లేకపోతే తెల్లారే లోపల అదే సర్దుకుంటుంది!" అంటూ మిగిలిన ఫాలలోచనులు తమ దారిన తాము వెళ్లిపోయారు.

ఆ తరవాత గుహలో ఉండే రాక్షసుడు, చూడటానికి కన్ను లేదుగనక, తడువుకుంటూ గుహ ద్వారంవద్దకు వెళ్ళి, ఆ ద్వారానికి అడ్డంగా వున్న రాతిని ఎత్తి పక్కన పెట్టి, ద్వారానికి అడ్డంగా తిష్ఠవేసి, కాపలి కూచున్నాడు.

గ్రీకులు బయటికి వెళ్ళటానికి యత్నిస్తే పట్టుకుందామని వాడి ఉద్దేశం.

కాని రూపధరుడు వాడనుకున్నంత అమాయకుడు కాడు. ఈ గుహలోనుంచి



తానూ, తన అనుచరులూ బయటపడటానికి అనేక మార్గాలను అతను అదివరకే ఆలోచించిపెట్టాడు. వాటన్నిటిలోకీ అతనికి ఒక పద్ధతి ఉత్తమంగా కనిపించింది.

అదేమిటంటే: ఈ రాక్షసుడి గొర్రెలు తెగబలిసి, చాలా పెద్దవిగా వున్నాయి. వాటి ఒంటిమీద బొచ్చుకూడా బాగా పెరిగివున్నది. రూపధరుడు మూడేసి గొర్రెలను కలిపి కట్టి, మధ్యగొర్రె పొట్టకు తన అనుచరుణ్ణి ఒక్కొక్కణ్ణి చొప్పున కట్టాడు. ఈ విధంగా తన మిగిలిన అనుచరులలో ఒక్కొక్కడి కోసమూ మూడేసి గొర్రెలు ఏర్పాటుచేసి చిట్టచివరకు తాను ఒక్కడూ మిగిలాడు.



రాక్షసుడి గుహలో వున్న గొర్రెలన్నిటిలోకీ పెద్దదైన ఒక పోతును తనకుగాను అతను ప్రత్యేకించుకున్నాడు.

కొంతసేపటికి తెల్లవారిపోయింది. గొర్రెలూ, మేకలూ మేతకోసం బయలుదేరాయి. గుహద్వారంలో కూచుని ఇంకా బాధతో మూలుగుతున్న రాక్షసుడు, బయటికి వెళ్ళే తన గొర్రెలనూ, మేకలనూ వీపులమీద తడవసాగాడు.

తన శత్రువులు వాటి అడుగున ఉంటారని ఆ మూఢుడుకి తట్టలేదు.

తన అనుచరులంతా దాటి వెళ్లాక, రూపధరుడు తనకోసం ప్రత్యేకించుకున్న గొర్రె అడుగుభాగాన, దాని బొచ్చును గట్టిగా పట్టుకునివుండి, దానితోబాటు బయటికి వచ్చాడు. ద్వారంవద్ద రాక్షసుడు ఆ గొర్రెపొట్టేలునుకూడా వీపుమీద తడివి, "రోజూ అన్నిటికన్న ముందు వెళ్ళేదానివి, ఇవాళ అన్నిటికన్న వెనకపడ్డావేమే, సోమరిపోతా? దుర్మార్గుడైన ఉత్తుత్త మనిషి నీ యజమానిని తప్పతాగించి, కన్నుపొడిచి గుడ్డివాణ్ణి చేశాడన్న విచారంతో కుంగిపోతున్నావా? వాణ్ణి తగిన విధంగా నేను శిక్షిస్తాలే! దిగులుపడకు!" అంటూ దానిని బయటికి వెళ్ళిపోనిచ్చాడు.







గొర్రెపోతు గుహ దాటి కొంత దూరం వెళ్లాక రూపధరుడు దాని జూలును వదిలి పెట్టి లేచి నిలబడ్డాడు. తరవాత అతను తన అనుచరులను ఒక్కొక్కరినే కట్లు విప్పి గొర్రెలనుంచి విడిపించాడు. ఈవిధంగా రూపధరుడి చాకచక్యంవల్ల రాక్షసుడి వాత పడకుండా ప్రాణాలతో బయటపడిన గ్రీకులు వేగంగా పరిగెత్తి తీరాన తమకోసం వేచి వున్న నౌకను చేరుకున్నారు.

రూపధరుడూ, మిగిలిన పన్నెండుమందీ ఏమైపోయారో అని ఆందోళన చెందుతూ నౌకలో కనిపెట్టుకునివున్న వారు, జరిగిన సంగతి తెలుసుకుని, రాక్షసుడికి ఆహారమై పోయిన తమ అనుచరులకోసం పెద్దపెట్టున శోకాలు పెట్టసాగారు.

రూపధరుడు వారి శోకాన్ని వారించుతూ, "ఇది శోకించటానికి సమయంకాదు. మనకు వ్యవధి లేదు. అందినన్ని గొర్రెలనూ, మేకలనూ పట్టుకు రండి. మనం బయలుదేరి పోదాం!" అన్నాడు. రూపధరుడి అనుచరులు అలాగే చేసి నౌకను సముద్రంమీదికి తీసుకు పోసాగారు.

నౌక తీరంవదిలి కొంత దూరం వెళ్లింది. అప్పుడు రూపధరుడు రాక్షసుడి గుహకేసి తిరిగి ఎలుగెత్తి ఇలా కేక పెట్టాడు :

"ఓరీ పాపాత్ముడా! ఘాలలోచనా! నేనూ నా అనుచరులూ, సులువుగా నీకు లొంగుతామనుకున్నావురా? అతిథులను చంపి తిన్నందుకు నీకు తగిన శాస్తి జరిగింది! ఇకనైనా బుద్ధి తెచ్చుకోరా!"

ఈ కేక రాక్షసుడికి వినిపించింది. వాడు కోపావేశంతో ఒక పెద్ద కొండరాయిని, మట్టి పెళ్లను విరిచినట్టు విరిచి, రూపధరుడి గొంతు వినిపించిన దిక్కుగా విసిరాడు. ఈ రాయి రూపధరుడి నౌకకంటె దూరంగా వెళ్లి పడింది. అది పడిన చోట బ్రహ్మాండమైన అల బయలుదేరి, రూపధరుడి నౌకను మళ్లీ తీరానికేసి తోసుకురాసాగింది.



రూపధరుడు అదుర్దాగా గడవేసి నౌకను మళ్లీ సముద్రంవేపు తోస్తూ, తెడ్లు జోరుగా వెయ్యమని తన అనుచరులకు కళ్లతో సైగ చేశాడు. ఈసారి నౌక పూర్వం కన్న రెట్టింపు దూరం వెళ్లాక రూపధరుడు మళ్ళీ రాక్షసుణ్ణి కవ్వించటానికి ఉపక్రమించాడు. ఊరుకోమని అతని అనుచరులు ఎంతగానో ప్రాధేయపడ్డారు; కాని అతను వారి మాట లక్ష్యపెట్టక ఎలుగెత్తి ఈ విధంగా అన్నాడు:

"ఓరీ రాక్షసాధమా! నీ కన్ను పొగొట్టిన దెవరని ఎవరైనా అడిగితే, ఆ పని చేసినవాడు రూపధరుడని చెప్పు! వాడు ట్రోయ్‌ని జయించిన వీరుడని చెప్పు! వాడిది ఇథకాదేశమని చెప్పు!"

ఈసారి రాక్షసుడు మరొక పెద్ద కొండ రాయి విరిచి తన బలంకొద్దీ గురిగా విసిరాడు. అది రూపధరుడి నౌకకు చాలా సమీపంగా వచ్చి పడింది. అయితే ఈసారి దానినుంచి బయలుదేరిన అల రూపధరుడి నౌకను తీరానికి మరింత దూరంగా తీసుకు పోయింది.

త్వరలోనే రూపధరుడూ అతని అనుచరులూ మిగిలిన నౌకలను చేరుకున్నారు. ఆ నౌకలలో వుండిన గ్రీకులు తమ అనుచరుల క్షేమంకోసం ఎంతో బెంగపడి వున్నారు. వారికిప్పుడు పరమానందం కలిగింది. కాని రాక్షసుడికి ఆహారమైపోయిన వారికోసం వారంతా దుఃఖించారు.

తరవాత రూపధరుడు తెచ్చిన గొర్రెలను చంపి అందరూ సమంగా పంచుకుని తిని, ఉత్సాహంగా సారా తాగి గ్రీకులు పగలల్లా వెళ్ళబుచ్చి, ఆ రాత్రికి తీరానే పడుకుని నిద్రపోయారు. మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు, నౌకలన్నీ లంగరు ఎత్తి ప్రయాణం సాగించవలసిందిగా ఉత్తరువిచ్చాడు. అవన్నీ సముద్రంమీద మళ్ళీ బయలుదేరాయి. (ఇంకా వుంది)





# మిత్రభేదం

వినిపింప వారలు - విస్మయ మంది
అనిరి సాక్ష్యము లే-నియట్టి వ్యాజ్యమును
కనుగొను టెట్లని-క్రమ్మఱ వాడు
తనకు చెట్లే సాక్షు-లని విన్నవించె
సరి రేపు పోదమా - స్థలమున కంచు
పురము పెద్దలు సెప్ప - నరిగి రిర్వురును.
ఆ రేయి తండ్రితో - ననె పాపబుద్ధి
ఊరెల్ల వచ్చు నే-దో చేయవలయు
నాయనా ! అడవిలో - నట నొక్క జమ్మి
పాయకయుండు నా - పంపును సేయు
దాని తొఱ్ఱను జేరి - దైవమ్మువోలె
కానరాకనె పల్క-గావలె సాక్షి
పొమ్మన్న, నీచుడౌ - పుత్రుని మాట
కిమ్మనకుండ కా-నిమ్మనె తండ్రి
ధనము పూడ్చిన వన-మ్మును రేపకడనె
జను లధికారులు- చని చేరినారు.
అట జమ్మిచెట్టు చెం-గట నిలుచుండి
పటు కంఠమున ననె - పాపబుద్ధియును
వనదేవతా నీవె - నను రక్షసేయు
ధనమెల్ల పోగొట్టు-కొనినాడ నేను.
మాలోన నెవ్వరీ - మహిత ధనమ్ము
నీలాగు దోచిరో - నీవె వచింపు.
అన్నంత తొఱ్ఱలో - అణగిన ముసలి
చిన్నగా నెలుగెత్తి - చెప్పె నిట్లనుచు
'దొంగిలించినవాడు - ధూ! ధర్మబుద్ధి
సంగతి యిది' యని - చాలించె వాడు.
కటకటా యిది యేటి - కర్మ మటంచు
తటుకున నటు వెళ్లి - ధర్మబుద్ధియును
గడ్డిగాదము చెట్టు-కడ ప్రోగుసేసి
చెడ్డ చూతమటంచు - చెత్త ముట్టించె
గబగబ మంటలు - గగనాని కెగయ
దబదబ త్రోసుక - ధరణిపై దుమికి
ఆ పాపబుద్ధి క-న్నాయన యేడ్చె
తాపమ్ము కలిగి ద-గ్ధశరీరు డగుచు
జనులెల్ల గుమిగూడి - తను నిందసేయ
వినిపించె వాడు ఆ - విధమెల్ల కడకు

విద్వాన్ విశ్వం



మందలించుచు పెద్ద - లందఱు పట్టి
పంద యటంచు నా - పాపపుబుద్ధి
చెట్టుకొమ్మకు వ్రేల-గట్టి శిక్షించి
ఇట్టు లన్నారు తా - మిది యంత చూచి :

కొంగా, పామూ కథ :

కలదు కొంగలు కొల్ల-గా ఉన్న మఱ్ఱి
అల దాని తొఱ్ఱలో - కల దొక్క పాము.
పుట్టి పుట్టక ముందె - పొట్ట బెట్టుకొని
చెట్ట పామది వాని - చేడ్పాటువఱచె.
ఒకపరి పిల్లల - నూడ్చివేయంగ
ఒక మది చింతించి - కకవిక పడుచు
కొలనుగట్టును జేరి - తల వంచివేసి
జలజల కన్నీరు - జార్చుచు నుండె.

ఎండ్రి యేతెంచి యి-దేమని యడిగి
తీండ్రించు దిగులును - తెలుసుకొన్నాక
తమకు కొంగలు శత్రు-తతి గాన వాని
గమి నాశమొందింప-గా నెంచి బొంకె.
"మామ ! చేపల గొని-మఱి మఱి పోయి
ఆ ముంగిస వసించు - నా దరినుండి
పామున్న చోటిదా-కా మఱి వేయు
మా ముంగి పామును - హతమొనరించు"
అని చెప్ప నిజమని - ఆ కొంగ వెళ్ళి
వినిన రీతి నొనర్ప - వేగమే ముంగి
గునగున వచ్చి పా-మును చంపి పిదప
కనబడ్డ కొంగనె-ల్లను చంపి పోయె.
పాము చంపు నుపాయ-మేమొ చూచినది
తామట్లు చచ్చుట - తలపదా కొంగ
అట్టులె యీ పాపి - అర్థమ్ము గోరి
ఇట్టు లిక్కట్టొట - యెరుగడు నుండు.

కరటకుడు :

అట్టులే దమనకా - హతమతివగుచు
ఇట్టు లీ కీడు నీ-వే తెచ్చినావు.
నీ దాపున వసింప-నేరాదు వినగ
లేదె నీ కొక కథ - లేకివాడవుర ?

యుక్తికి ప్రతియుక్తి :

ఒక నగరమ్మున - నొక ధనశాలి
సకలమ్ము పోవ దే-శము వీడ నెంచె

కట! పూవు లమ్మి ఇ-చ్చట కట్టె లమ్ము
టెటులంచు పోవ నుం-కించె నాతండు.
తమవారు సంపాద-నము సేసియున్న
అమల లోహపు తుల - నట నొక్క శెట్టి
కడనుంచి వెళ్ళ అ-క్కడ యిక్కడనక
చెడుకాలమని ఊళ్ళు - చెడ తిరుగాడె.
వెనుకకు వచ్చి శె-ట్టిని తుల యడుగ
అనె దాని నెలుకలు - తినెనంచు వాడు.
అటులనా సరియని - అటు నిటు తిరిగి
పటు యుక్తిశాలి అం-తట ఎత్తువేసె.
స్నానార్థ మని నది - సరస కేగుచును
వాని కుమారుని-తోడనే నడిచె
అట నీట మునిగి ఆ - వటువును దాచి
మిటకరించుచు వచ్చి - మిన్నులు చూచె.
ఎడి నా సుతుండని - అడిగెను వాడు.
చెడు డేగ తన్నుక - వడినేగె ననెను.
దుర్మార్గుడా! డేగ - దోచునా బాలు
ధర్మాధికారుల - దటి కీడ్తునంచు
వాడు వీడును రాచ-వాడకు నటిగి
వా డెత్తి పోవగా - వాదుకు దిగిరి
పెద్దమనుష్యు లీ - పెను వాదు వించు
అద్దిరా డేగయే - హరియించు నెట్లు?
అనినంత తిరిగి వ-చ్చిన ధని అనియె
అనుమాన మేటికి-దంతయు జరుగు



ఇనుప త్రాసును తిను - నెలుకలే యుండ
విను డింక బాలుని - వినువీధి కెత్తి
కొనిపోవు డేగలు - గూడను ఉండు
అని వారు ఆశ్చర్య-మున వినుచుండ
జరిగిన కథనెల్ల - చక్కగా జెప్ప
కరము నవ్విరి వారు - సరియుద్ది యంచు.
కడకు పెద్దలు వాని - కడ తుల నిచ్చి
ఎడవాని రప్పించి - యిదిగొ అన్నారు.
తెలివిమాలిన స్నేహి - తుల కంటె మేలు
తెలివైన పగవాడు - తెలియదా నీకు.

దమనకుడు:

అది యెట్లు వివరింపు - మా సంగతేదొ
గదిరివేయకు మూర-కయె సోదరుండ!



# వెన్నెల నిచ్చెన

శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించే కాలంలో, విజయనగరంలోనే ఒక గజదొంగ బయలుదేరి రోజు కొక ఇంట్లో దొంగతనం చెయ్యసాగాడు. వాణ్ణి పట్టుకోవటానికి రాజుగారు చేయించిన ప్రయత్నాలేవీ చిన్నమెత్తయినా ఫలించ లేదు.

ఈ దొంగను ఎలాగైనా పట్టుకోవాలని తెనాలిరామలింగడికి బుద్ధి పుట్టింది. అతను నలుగురు చేరిన చోటికల్లా వెళ్లి, "ఈ గజదొంగ మా ఇంటిమీద ఎప్పుడు వచ్చి పడతాడోనని భయంగా ఉంది. ఎందుచేతనంటే మా నట్టింటో చాలా ధనరాసులున్నాయి!" అంటూ వచ్చాడు.

తెనాలిరామలింగడి ఇంట్లో చాలా ధనం ఉన్నదన్న సంగతి త్వరలోనే గజదొంగ చెవిని పడింది. వాడికా సంగతి తెలిసి ఏదో రాత్రి తన ఇంటికి రావాలనే తెనాలి రామలింగడి ఉద్దేశంకూడా. దొంగ తమ ఇంటికి వచ్చినప్పుడు ఏం చెయ్యాలో ఎలా మాట్లాడాలో రామలింగడు తన భార్యకు బాగా నూరిపోశాడు.

ఇంతలో ఒక రాత్రి గజదొంగ రామలింగడి ఇంటికి రానేవచ్చాడు. వాడికోసం రాత్రిళ్ళు మేలుకునివుంటున్న రామలింగడు, ఇంటి కప్పుమీద దొంగ కదులుతున్న అలికిడి వినగానే, పక్కన ఉన్న తన భార్యకు సైగచేశాడు.

వెంటనే ఆవిడ గొంతెత్తి, "ఏమండీ, దొంగాడు మనింటికికూడా వస్తాడేమో? నాకు భయంగావుంది," అన్నది.

"రానియ్యవే! మనింటో వున్న సొత్తంతా ఎత్తుకుపోతే దీనికి నాలుగింతలు తెస్తాను!" అన్నాడు రామలింగడు.

"నేను రోజూ అడుగుదామని మరిచిపోతున్నాను, ఈ బంగారమూ, రత్నాలూ

ఎస్. విమలకుమారి

ఎక్కడనుంచి తెస్తారండీ మీరూ?" అన్నది రామలింగడి భార్య.

"ఒసే, గట్టిగా అరవకు! నేనూ ఈ సొత్తంతా దొంగతనం చేసి తెచ్చిందే!" అన్నాడు రామలింగడు.

"ఎక్కడ దొంగతనం చేస్తారండీ?" అని భార్య అడిగింది.

"ఆ ఊసంతా నీకెందుకు? అనవసర ప్రసంగం చెయ్యక పడుకుని నిద్రపో!" అన్నాడు రామలింగడు.

"అలాకాదు! చెబితేగాని వదిలిపెట్టను! దొంగతనం చేస్తే మిమ్మల్ని ఎవరూ పట్టుకోరా?" అన్నది భార్య.

"బ్రహ్మరుద్రుడు దిగివచ్చినా పట్టుకో లేరు. నాదగ్గిర ఒక మంత్రం వున్నది!" అన్నాడు రామలింగడు.

"ఏమిటండీ ఆ మంత్రం?" అని అడిగింది భార్య.

రామలింగడు చాలాసేపు భార్యమీద విసుక్కుని చివరకు, "నన్ను శనిలాగా పట్టావే! నా రహస్యం చెబుతా విను. రాజు గారి కోటలో ఖజానా వుంది చూశావా? అది అయిదు నిలువుల ఎత్తుంటుంది. దాని కప్పుకు కొంచెం దిగువగా గోడలో మనిషి పట్టేటంత గవాక్షం ఒకటున్నది. నేనేం



చేస్తానో తెలుసా? వెన్నెల రాత్రిపూట ఖజానా ఇంటి కప్పుమీదికి చేరుకుంటాను. గవాక్షంలోనుంచి వెన్నెల లోపలికి పడే దాకా వేచివుండి, 'ఓం భ్రాంతి! ఓం భ్రాంతి! ఓం భ్రాంతి!' అని మూడుసార్లు చదువుతాను. ఆ మంత్రం చదవగానే చంద్రకిరణాలు తాళ్ళులాగా అయిపోయి నా చేతికి పట్టు చిక్కుతాయి. వాటి వెంబడి జారి ఖజానాలోకి దిగుతాను. నాకు కావలిసిన సొత్తంతా మూటగట్టుకుని మళ్ళీ కిరణాలు పట్టుకుని గవాక్షంలోనుంచి పైకెక్కి వచ్చేస్తాను. దొంగతనం ఎలా జరిగినదీ బ్రహ్మరుద్రుడుకూడా తెలుసుకోలేడు.

ఇలా వెన్నెల నిచ్చెన సహాయంతో నేను రాజుగారి ఖజానాను కొల్లగొట్ట గలుగు తున్నాను. అందుకే నన్నింతవరకు పట్టు కున్నవారు లేరు!" అన్నాడు తన భార్యతో.

"అదా సంగతి?" అంటూ తెనాలి రామలింగడి భార్య తృప్తి చెందినదాని లాగా నటిస్తూ కళ్లు మూసుకున్నది.

భార్యా భర్తల మధ్య జరిగిన సంభాషణ యావత్తూ గజదొంగకూడా విన్నాడు. వాడికి ఇప్పుడు మామూలు దొంగతనాల మీద మోజు తగ్గిపోయింది. దోస్తే రాజుగారి ఖజానాయే దోచాలనుకున్నాడు.

మర్నాడు రాత్రే వాడు ఇళ్ల కప్పుమీదుగా పాకుతూ రాజుగారి ఖజానా ఉండే కప్పును చేరుకున్నాడు. రామలింగడు చెప్పిన గవాక్షం కనిపించింది. అది భూమికి దాదాపు అయిదు నిలువుల ఎత్తున వున్నది. అయినా గజదొంగ భయపడలేదు. ఆ గవాక్షంలో నుంచి చంద్రకిరణాలు ఖజానాలోకి పడే దాకా వేచిఉండి, వాడు మూడుసార్లు, "ఓం భ్రాంతి! ఓం భ్రాంతి! ఓం భ్రాంతి!" అని చదివి, గవాక్షంమీద అడుగుపెట్టి చేతితో కిరణాలను పట్టుకున్నట్టు నటిస్తూ లోపలికి దూకాడు.

వాడిచేతికి గాలితప్ప ఏమీ చిక్కలేదు. అంత ఎత్తునుంచి పడటంవల్ల వాడికాళ్లు రెండూ విరిగిపోయాయి. మర్నాడు రాజ భటులు ఖజానా తెరిచినప్పుడు, గజదొంగ కదలలేని స్థితిలో ఉండటంవల్ల వాళ్లకు సులువుగా దొరికిపోయాడు. దొంగతోబాటు వాడు దోచుకున్న సొత్తంతా దొరికింది.

తరువాత తెనాలిరామలింగడు రాయల వారి సభలో తాను గజదొంగను పట్టుకోవ టానికి పన్నిన యుక్తినిగురించి చెప్పాడు. సభికులందరూ విరగబడి నవ్వారు.

గజదొంగను పట్టించినందుకు రాయల వారు రామలింగడికి మంచి బహుమానం కూడా ఇచ్చారు.






పూర్వం ఒక గ్రామంలో ముగ్గురు అన్న దమ్ములుండేవారు. వారిలో మూడోవాడు వెర్రిబాగులవాడు. తండ్రి చనిపోయినాక పెద్దవాళ్ళిద్దరూ ఆస్తి పంచుకుని, మూడో వాడికి ఒక పాత పెట్టెమాత్రం ఇచ్చారు.

ఒకనాడు పెద్దవాళ్లిద్దరూ అమ్మే సరుకులను తీసుకుని సంతకు బయలుదేరి వెళ్ళారు. సంతకు తానుమాత్రం ఎందుకు వెళ్ళగూడదనుకుని, ఒక ఎద్దు కొమ్ములకు పలుపు కట్టి, పలుపుతాడు చేతబట్టుకుని వెర్రిబాగులవాడు కూడా బయలుదేరాడు.

వాడు అడవిదారిన పోతూవుండగా ఒక ఎండిపోయిన చెట్టు గాలికి కదిలి, కొమ్మల రాపిడికి కిరకిరలాడింది. వెంటనే వెర్రి బాగులవాడు ఆగి, "ఈ ఎద్దును కొంటా నంటావా? ఇరవై రూపాయలు అఖరు బేరం! ఇష్టమైతే కొను. లేకపోతే లేదు. అంతే!" అన్నాడు.

చెట్టు మళ్ళీ కిరకిరలాడింది.

"డబ్బు చెల్లించటానికి గడువు కావాలా? రేపు ఇవ్వొచ్చులే. ఇంతలో నీ డబ్బెక్కడికి పోతుంది. ఇదుగో ఎద్దు!" అంటూ వెర్రి బాగులవాడు తాను సంతకు తీసుకుపోతున్న ఎద్దును ఆ ఎండిన చెట్టుకు కట్టేసి, సంతోషంగా ఇంటికి వెళ్లిపోయాడు.

"ఏంరా, వెర్రివాడా? నీ ఎద్దు కనిపించదేం?" అని అన్నలు అడిగారు.

"ఇరవై రూపాయలకు అమ్మేశాను!" అన్నాడు వెర్రిబాగులవాడు.

అన్నలు ఆశ్చర్యంతో, "అదేమిటి? డబ్బేదీ?" అన్నారు.

"రేపటిదాకా గడువిచ్చాలే!" అన్నాడు వెర్రిబాగులవాడు. అన్నలు వాణ్ణి తిట్టి అంతటితో ఆ విషయం పోనిచ్చారు.

మర్నాడు తెల్లవారుతూనే మూడోవాడు బయలుదేరి అడవిలో ఉన్న మోడు చెట్టు

టి. విద్యాసాగర్





వద్దకు వెళ్ళాడు. చెట్టు గాలికి ఊగుతూ కిరకిరలాడుతున్నదిగాని, ఎద్దు లేదు.

వెర్రిబాగులవాడు చెట్టుతో, "అన్న ప్రకారం నా పైకం యిచ్చెయ్యి!" అన్నాడు.

చెట్టు కిరకిరలాడింది.

"రేపా? ఇంకానయం! ఇవాళంటే సరే గదా అని ఒప్పుకున్నాను. అంతగా అడుగుతున్నావు గనక పోనీ రేపటిదాకా ఆగుతాను. రేపు ఇవ్వకపోతే ఎంతమాత్రమూ మర్యాదగా వుండదు. తరవాత నీ యిష్టం!" అని చెట్టుతో చెప్పి వాడు ఇంటికి వచ్చేశాడు.

"నీ డబ్బు తెచ్చుకున్నావా?" అని అన్నలు వాణ్ణి అడిగారు.

"ఇంకా లేదు. రేపటిదాకా ఆగాలి!" అన్నాడు వాడు.

"ఇంతకూ ఎద్దును ఎవరికి అమ్మావు?" అని వాళ్లు అడిగారు.

"అడివిలో వుండే మోడు చెట్టుకు," అని వాడు జవాబిచ్చాడు.

"వెర్రి వెధవా!" అని తిట్టారు అన్నలు.

వెర్రిబాగులవాడు మర్నాడు ఉదయమే లేచి, గొడ్డలి భుజానపెట్టుకుని అడవిలో వుండే చెట్టువద్దకు వెళ్ళాడు.

"నాడబ్బు నాకు కక్కెయ్యి! నీకు అప్పు పెట్టినందుకు మా అన్నలు నన్ను తిట్టారుకూడా!" అన్నాడు వాడు చెట్టుతో.

చెట్టు కిరకిరలాడింది.

"అదేం కుదరదు! ఇంక ఒక్క క్షణం ఆగను, నా డబ్బు నా కివ్వకపోతే నిన్నిప్పుడే పేళ్లు వేసెయ్యగలను, జాగర్త!" అన్నాడు వెర్రిబాగులవాడు.

చెట్టు కిరకిరలాడింది. వెర్రిబాగులవాడు గొడ్డలి ఎత్తి దాని బోదెమీద కొట్టసాగాడు. అసలే ఎండి, చీకి ఉన్న ఆ చెట్టు నాలుగు దెబ్బలకల్లా పెళపెళా విరిగి పడింది.

అది అంత సులువుగా విరగటానికి మరొక కారణమేమంటే ఆ చెట్టుబోదెలో తొర్ర ఒకటి ఉంది. అందులో కొందరు



దొంగలు తాము దోచిన బంగారం దాచుకున్నారు. చెట్టు విరిగి పడగానే బంగారమంతా వెర్రిబాగులవాడి కళ్లబడింది.

ఆ బంగారంలో కొంత తన జేబుల్లో కుక్కుకుని వాడు ఇంటికి పరిగెత్తాడు.

"ఈ బంగారమంతా నీకెక్కడిదిరా ?" అని అన్నలు వాణ్ణి అడిగారు.

"నాలుగు తగిలించేసరికి అడవిలో చెట్టు కక్కింది! ఇంకా చాలా ఉంది. నేను కొంచెమే తెచ్చుకున్నాను!" అన్నాడు వెర్రిబాగులవాడు.

వాడి అన్నలు వెంటనే వాణ్ణి తీసుకుని అడివికి వెళ్లి, మిగిలిన బంగారంకూడా తీసుకుని ఇంటిదారి పట్టారు.

"నువు వట్టి వెర్రికుంకవు! మనదగ్గిర ఈ బంగారం ఉన్నట్టు ఎవరికీ తెలియనివ్వకు! తెలిస్తే ప్రమాదం!" అని వెర్రిబాగులవాడితో అన్నలు చెప్పారు.

"నేనెవరికీ చెప్పను!" అన్నాడు వాడు.

వారు కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళ ఊరి శాస్తులుగారు ఎదురుపడి, "ముగ్గురూ గోతాలలో ఏమిటో తెస్తున్నారే! ఏమిటవి ?" అని అడిగాడు.

"దొండకాయలు!" అని పెద్దవాళ్లు చెప్పారు. కాని వెర్రిబాగులవాడు వెంటనే,



"శాస్తుల్లుగారిని మోసం చెయ్యవచ్చా? ఇది బంగారం, శాస్తుల్లుగారూ, బంగారం! కావలిస్తే చూడండి!" అంటూ తన మూట విప్పి చూపాడు.

అంత బంగారం చూడగానే శాస్తుల్లుగారు మతిపోయినట్టయి, మూటలోనుంచి రెండు గుప్పిళ్ల బంగారం ఒడిసి లాక్కున్నాడు.

"అఁ? అదేం పని?" అంటూ వెర్రిబాగులవాడు తన గొడ్డలితో శాస్తుల్లుగారి నెత్తిన ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు ఆయన కాస్తా చచ్చి ఊరుకున్నాడు.

"ఇదేం పనిరా, మూర్ఖుడా! నీ గొంతు మీదికి తెచ్చుకోవటంగాక, మా గొంతు

మీదికికూడా తెచ్చేటట్టున్నావే ?" అంటూ పెద్దవాళ్లిద్దరూ దారికి కొంచెం ఎడంగా ఒక గొయ్యితవ్వి శవాన్ని పూడ్చేశారు.

కాని ఇదంతా వెర్రిబాగులవాడు చూశాడు గనక ప్రమాదం ఉందని గ్రహించి, పెద్దవాళ్లిద్దరూ ఆ రాత్రి మళ్లీ వచ్చి, శవాన్ని పైకి తీసి దూరంగా ఇంకొక చోట పూడ్చి, మొదట శవాన్ని పూడ్చిన చోట ఒక చచ్చిన మేకను పూడ్చిపెట్టారు.

కొద్దిరోజులకల్లా శాస్త్రుల్లుగారు కనపడటం లేదని ఊళ్ళో అందోళన బయలు దేరింది. గ్రామస్థులు, "శాస్త్రుల్లుగారు ఏమై ఉంటాడో !" అని అనుకోవటం విని వెర్రి బాగులవాడు, "మీ కసలు ఏమీ తెలీదు. ఆయన్ను నేనే గొడ్డలితో తల పగలగొట్టాను. మా అన్నలు పూడ్చేశారు. నా మాట నమ్మకం లేకపోతే నేను చూపిస్తా రండి !" అంటూ, శాస్త్రుల్లుగారిని పూడ్చిపెట్టిన చోటికి గ్రామస్థులను తీసుకుపోయాడు.

"ఇదుగో, ఇక్కడే పూడ్చాం !" అంటూ వాడు పలుగు తీసుకుని గుంట కొంత లోతు తవ్వి గ్రామస్థులతో, "శాస్త్రుల్లుగారికి బొచ్చు ఉండేదేనా ?" అన్నాడు.

"ఉండేదే !" అన్నారు గ్రామస్థులు.

"గడ్డం ఉండేదేగదా ?" అన్నాడు వెర్రి బాగులవాడు.

"అవును, వుండేదే !" అన్నారు వాళ్ళు.

"నెత్తిన రెండు కొమ్ములుండేవేగదా !" అన్నాడు వెర్రిబాగులవాడు.

"కొమ్ములుండట మేమిటి ?" అన్నారు గ్రామస్థులు ఆశ్చర్యంగా.

"నామాట నమ్మకపోతే మీరే చూసు కోండి !" అంటూ వాడు చచ్చిన మేక తలను పైకెత్తి చూపాడు.

గ్రామస్థులకు వాడి మాటలలో నమ్మకం పోయింది. "ఈ వెర్రిబాగులవాడి మాటల కేంలే ? పదండి !" అంటూ వాళ్లు తమ దారిన వెళ్లిపోయారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 అక్టోబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చిన్నది చెపుతా నొక మాట

రెండవ ఫోటో : అన్నది చెప్పకు ఏచోట

పంపినవారు :

బి. ప్రకాశరావు, C/o. H. C. No. 206, ఏ. సి. లైన్, కంటోన్మెంట్, విజయనగరం

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# సాధారణ సస్తన జంతువులు

క్రిందటినెల కొన్ని వింత సస్తన జంతువులను గురించి తెలుసుకున్నాం. మామూలు సస్తన జంతువులకూ వాటికీ ముఖ్యమైన తేడా ఏమిటంటే, అవి తల్లిగర్భంనుంచి గుడ్ల రూపానగాని, పూర్తి పరిణామం చెందకుండాగాని బయటికి వస్తాయి. సాధారణ సస్తన జంతువులన్నీ పూర్తి పరిణామం చెందినాకనే పుడతాయి.

ఒకప్పుడు భూమిపైన బ్రహ్మాండమైన సరీసృపాలుండేవనీ, ఇవి భూమినీ, నీటినీ, గాలినీకూడా ఆక్రమించాయనీ మనం తెలుసుకుని ఉన్నాం. సస్తన జంతువులుకూడా అంతే; వీటిలో భూచరాలే గాక, జలచరాలూ, ఎగిరేవీకూడా ఉన్నాయి.

సస్తన జంతువులలో మనం చూసేవాటిలోకెల్లా పెద్దది ఏనుగు. ఇతర జంతువులకు లేని ప్రత్యేకత ఏనుగుకు ఒకటి ఉన్నది : అదేమిటంటే దాని తొండం. ఏనుగులలో రెండు ప్రధాన జాతులున్నాయి. మన దేశంలో ఉండేవి కాస్త చిన్నవి. ఆఫ్రికాలో ఉండే ఏనుగులు ఇంతకంటె చాలా పెద్దవి. అవి 11న్నర అడుగుల ఎత్తుండి దాదాపు ఆరు టన్నుల బరువుంటాయి. వాటి చెవులుకూడా చాలా పెద్దవి. అయితే, ఏనుగుజాతి ఆఫ్రికాఖండం నుంచే ఇతర ఖండాలకు వ్యాపించిందనీ, ఆసియా ఏనుగులు కాలక్రమాన మార్పు చెందాయనీ శాస్త్రవేత్తలు చెబుతారు. మన ఏనుగుల తొండాలకు ఒకటే మొన ఉంటుంది. కాని ఆఫ్రికా ఏనుగుల తొండాలకు రెండు మొనలుంటాయి.



పూర్వం ఉండిన దయ్యపుబల్లులకు శరీరాలు పెద్దవేగాని మెదడులు చిన్నవి. ఏనుగుకు అలాకాక మంచి మెదడుకూడా ఉన్నది. జంతుజాతులలో కోతుల తరవాత ఏనుగును తెలివిలో మించే జంతువు లేదు. అయినా బుద్ధిలో అది మానవుడికి తక్కువ కావటంచేత అది మానవుడి బానిస అయింది.

నీటిలో నివసించే నస్తన జంతువు తిమింగిలం. తిమింగలం చాలా పెద్దదని మనకు తెలుసు. కాని అనేకమందికి తెలియని విషయమేమంటే ఈనాడు మనం చూసే నీలితిమింగిలం పూర్వం భూమిమీద తిరిగిన దయ్యపుబల్లు లన్నిటికంటెకూడా చాలా పెద్దది. మనకు తెలిసినంతవరకు సృష్టిలో ఈ తిమింగిలాన్ని మించిన జంతువు పుట్టిఉండలేదు. నీలితిమింగిలం నిడివి 100 అడుగులకు పైబడి ఉంటుంది. దాని బరువు 120 టన్నులదాకా ఉంటుంది. అప్పుడే పుట్టిన తిమింగిలంపిల్ల 25 అడుగుల నిడివి ఉండవచ్చు. దాని ప్రమాణం 50 అడుగులకు పెరిగేదాకా—అంటే సుమారు 7 మాసాలపాటు—అది తల్లిపాలమీదే బతుకుతుంది! అయితే ఇది ఇతర నస్తన జంతువులలాగే పిల్లల్ని పెడుతుంది; ఊపిరి తిత్తులతో గాలి పీలుస్తుంది. ఇరవై నిమిషాల కొకసారి గాలికోసం తిమింగిలం నీటిపైకి వస్తుంది.

గాలిలో ఎగిరే నస్తన జంతువులు గబ్బిలాలు. గబ్బిలాలలో మూడు రకాలున్నాయి. వీటిలో చిన్న గబ్బిలాలు కీటకాలను తింటాయి; ఇవి మనకు చాలా ఉపకారంగా ఉంటాయి. పెద్ద గబ్బిలాలు (కబోదిపక్షులు, లేక ఋషిపక్షులు) పళ్లు తింటాయి. ఇవి పళ్లతోటలను నాశనంచేస్తాయి. అచ్చుగా రక్తం తాగే గబ్బిలాలుకూడా ఉన్నాయి.





# వార్తలు-విశేషాలు

దేశంలో భూసార సంరక్షణకుగాను, కేంద్రప్రభుత్వం కొన్ని పథకాలను తయారుచేసింది. ఆంధ్రలో యిందుకుగాను మూడు పథకాలు అమలు జరగగలవు. యివి తెలంగాణా ప్రాంతంలోనూ, విశాఖజిల్లాలోనూ, మాచ్‌ఖండ్ ప్రాంతాల గల భూసారసంరక్షణకు సంబంధించినవి. ఈ పథకాల ఖర్చుకు రు. 8,74,000 ఆంధ్రప్రభుత్వానికి మంజూరుకాబడింది.

* * * *

మన దేశానికి కావలసిన మరమగ్గాలను, వాయిదాలపై డబ్బు చెల్లింపు పద్ధతిని జపాన్, బ్రిటన్ తదితర దేశాలనుంచి దిగుమతి చేసుకోవటానికి, కేంద్రప్రభుత్వం ఆలోచిస్తున్నది. ద్వితీయ పంచవర్షప్రణాళికకింద, విదేశాలకు ఎగుమతికోసమని 35 కోట్ల గజాల వస్త్రాల వుత్పత్తిని వుద్దేశించి, 18,000 మరమగ్గాలను నెలకొల్పనున్నారు.

* * * *

గొప్ప శిల్పకళాఖండాలు గల అజంతా గుహలవద్ద, ఉద్యానవనాన్ని వేయటానికి, బొంబాయి ప్రభుత్వానికి కేంద్రప్రభుత్వం పదివేల రూపాయలు మంజూరుచేసింది. యీ ఉద్యానవనాన్ని బొంబాయి ప్రభుత్వమే వేసి, పోషిస్తుంది. అయితే దీని నమూనాను ఇండియా ప్రభుత్వం పబ్లిక్‌వర్క్స్‌శాఖకు చెందిన హార్టికల్చరల్ డైరెక్టర్ తయారుచేసి యిస్తారు.

* * * *

ఇండియాలో కొత్త నౌకానిర్మాణకేంద్రాన్ని ఎక్కడ ఎలా నిర్మించాలన్న విషయమై, ప్రభుత్వానికి సలహా చెప్పటానికి, ఒక బ్రిటిష్ ప్రతినిధివర్గం మనదేశం వచ్చింది. వీరు నెల్లూరు



జిల్లాలో ఒక స్థలాన్ని, పశ్చిమబెంగాల్, ఒరిస్సా, కేరళ, మద్రాసు, మైసూరు, బొంబాయి రాష్ట్రాలలో వివిధప్రదేశాలను సందర్శించి, ఇండియా ప్రభుత్వానికి సలహా చెప్పగలరు.

* * * *

రెండు వేల సంవత్సరాలకంటె పూర్వపు అశోక స్తంభ మొకటి బుద్ధుని జన్మస్థలమైన లుంబినికి ఏడు మైళ్ల దూరంలో యిటీవల కనుగొనబడిందని, నేపాల్‌లోని బౌద్ధసంఘం ప్రకటించింది. గత మూడు మాసాలలో ఆ ప్రాంతంలో మొత్తం మూడు అశోక స్తంభాలు కనుగొనబడినవి.

* * * *

ద్వితీయ ప్రణాళికా కాలంలోని మొదటి సంవత్సరంలో (**1956-57**) వరదల నివారణ పథకాలకు **870·86** లక్షల రూపాయలు వెచ్చించబడ్డాయి. ఇందులో ఆంధ్రప్రదేశ్‌లో వరదల నివారణ పథకాలకు ఖర్చు అయిన మొత్తం **11·65** లక్షల రూపాయలు.

* * * *

న్యూ ఢిల్లీలో పశ్చిమ జర్మనీ ప్రభుత్వం ఒక పఠనమందిరాన్ని యేర్పాటుచేసింది. దానికి "మాక్స్ ముల్లర్ భవన్" అని పేరు. ఈ సాంస్కృతిక కేంద్రానికి పౌర విమానశాఖా మంత్రి ప్రొఫెసర్ హుమయూన్ కబీర్ జూలై **24**-వ తేదీ ప్రారంభోత్సవం జరిపారు.

* * * *

ప్రఖ్యాత సినిమా నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి చలనచిత్ర వజ్రోత్సవం, **28** వ తేదీన కోడంబాకంలోని విజయా గార్డెన్స్‌లో అత్యంత వైభవంగా జరిగింది. యీ వజ్రోత్సవానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజనాడార్‌గారు, చిత్రనిర్మాతలకు శ్రీ నాగేశ్వరరావు తరఫున షీల్డ్‌లు బహూకరించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్సెలర్ డాక్టర్ వి. ఎస్. కృష్ణగారు, విద్యార్థులకు ఉచిత వేతనానికిగాను శ్రీ నాగేశ్వరరావుగారు యిచ్చిన విరాళం **25,000** రూపాయల చెక్కును స్వీకరించారు.



**Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'**


అశ్వరాజ్ వారి మహోత్తర పౌరాణిక చిత్రము
ఆగష్టు విడుదల
N.T. రామారావు..గుమ్మడి.
ఎ.ప్రకాశరావు..రాజనాల....
జమున..కృష్ణకుమారి.......
సూర్యకళ..సత్యాదేవి......
నటించిన.
పూర్ణా రిలీజ్
వినాయకచవితి
డైరెక్షన్..సముద్రాల.... సంగీతం..ఘంటసాల
నిర్మాత... కె.గోపాలరావు.
మైసూర్ డిస్ట్రిబ్యూటర్లు : విజయా టాకీ డిస్ట్రిబ్యూటర్స్, బెంగళూరు.

మా పనితనమును
గురించి గొప్పగా
చెప్పటము కాదు

# అత్యుత్తమంగా

చేసి చూపుతాము

★

పోస్టర్లు
క్యాలెండర్లు
కార్డ్లు
లేబిల్సు
బుక్లెట్సు
ఫోల్డర్లు

ఆఫ్‌సెట్ ప్రింటింగులో ఏది కావలసినా సరే

మేలైన ముద్రణకు గుర్తు




## ప్రసాద్ ప్రాసెస్ (ప్రైవేట్) లి. మదరాసు - 26

బొంబాయి ప్రతినిధి కార్యాలయం :
లోటస్ హౌస్, మెరీన్ లైన్స్, బొంబాయి - 1.
ఫోన్ : 241162

# రు. 31/- లకే

## మీకు అద్భుతమగు నవీన

# GEVABOX

## గెవాబాక్స్ కెమెరా



పూర్తి ఆయిన పోర్ట్రైట్
అటాచ్‌మెంటుతో సహా

★ గెవాబాక్స్ 120 ఫిలింమీద (2¼ × 3¼) 8 బొమ్మలిస్తుంది.

★ గెవాబాక్స్ ఫ్లాష్‌కోసం సింక్రొనైజు చేయబడినది.

★ గెవాబాక్స్ టైమ్ ఎక్స్‌పోజర్స్‌కు సెకండులో 1/50వంతు 1/100 వంతు షటర్‌స్పీడ్సు 'బి' సెట్టింగు కలిగి ఉన్నవి.

★ గెవాబాక్స్ పూర్తి పోర్ట్రైట్ అటాచ్మెంటుతో దొరకును.

★ గెవాబాక్స్‌కు ఆప్టికల్ ఐ, లెవల్ వ్యూఫైన్డరు ఉన్నవి.

★ గెవాబాక్స్‌లో ఫిలిమ్ ఎక్కించుట అతి సుకరము.

విలువకు తగిన వస్తువు కొనండి.
గెవాబాక్స్ కెమెరా కొనండి.

**GEVAERT**




మంచి చిత్రాలకు గెవాపాన్ 33 లేక 36 రోల్ ఫిలిమ్సు ఉపయోగించండి

**ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED**

Z. 87(a)

## ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్

కస్తూరి బిల్డింగ్, జంషెడ్జీతాతా రోడ్డు, బొంబాయి - 1.

# ఈ వేడుక శుభకాలములో
# బిన్నీవారి స్పన్ సిల్కు చొక్కా
# వేసుకొని ఎంతో దర్జాగా కనపడండి

పెళ్ళిళ్ల కాలము వచ్చేసింది. ఎంతోమంది మిత్రుల యిళ్లలో శుభకార్యములకు, బంధువులను చూచుటకు విరామము లేకుండా వెళ్లవలసివస్తుంది.

ఇది మీరు దర్జాగా కనపడవలసిన సమయము. బిన్నీవారి స్పన్ సిల్కు గుడ్డలో తయారైన ఒక నాజూకైన సిల్కు చొక్కా ధరించండి. దానిని ధరిస్తే మీకు ఎంతో సుఖముగా ఉంటుంది మరియు మీ స్నేహితులు, బంధువులు దానిని నిశ్చయముగా మెచ్చుకొంటారు.

బిన్నీవారి సిల్కు చొక్కా గుడ్డ ఆశ్చర్యకరముగ తక్కువ ధరలో అసలైన సిల్కు యిచ్చే మెత్తదనము నిస్తుంది. అంత తక్కువలో అంత మంచి బట్ట బిన్నీవారు మాత్రమే యివ్వగలరు!





బెంగుళూర్ వులెన్, కాటన్ అండ్ సిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్

మేనేజింగ్ ఏజంట్స్

బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్
మద్రాసు

BY. 3246

Photo by R. K. Paul




బహుమతి
పొందిన వ్యాఖ్య

అన్నది చెప్పకు ఏచోట!

పంపినవారు:
బి. ప్రకాశరావు - విజయనగరం

